# ఎన్నో కప్పుల కమ్మని చిక్కని టీ కోసం

మా కుటుంబానికి,
ఎన్నో కప్పుల కమ్మని
చిక్కని టీ--రుబీకి
మా కృతజ్ఞులు !






లిప్టన్
రుబీ
డస్ట్

LRDC/CAS-1/78 TEL

## నూతన సంవత్సరం

# ఎలావుండాలని మీరు అభిలషిస్తున్నారు?




1979 వ సంవత్సరం పేలవంగా యాంత్రికంగానే వుంటుందని మీరు భావిస్తుంటే మేము చెప్పగలిగేది ఏమీ లేదు




అలాకాక నూతనసంవత్సరం ఊహించనియగని మార్పును కొనితెచ్చేలా అద్భుతంగా ఉత్తేజపూరితంగా వుండాలని మీరు ఆశించుతుంటే మాత్రం ఆ బాధ్యతను మాకు అప్పజెప్పండి!

అసాధారణ మాసపత్రిక రేపు ఇప్పటికే వేలాదిమంది జీవితాల్ని ఉన్నతంగా తీర్చిదిద్దింది. ఒక్క సంవత్సరంవ్యవధిలో మీకు నూతనజీవితాన్ని వాగ్దానం చేస్తోంది.



ఉచితం

## నూతన సంవత్సరాన్ని ఉజ్వలంగా ప్రారంభించడానికై ముందుగా ఈ విలువైన డైరీని ఉచితంగా స్వీకరించండి!




మీరు చేయవలసిందల్లా

* రేపు మాసపత్రికకు చందాదారులుగా నమోదుచేయమని కోరుతూ ఇప్పుడే మీ పూర్తి చిరునామాతో కార్డు వ్రాయండి.
* వెంటనే దాదాపు రూ 10/- విలువచేసే డైరీని ఉచితంగా వి. పి. పి. ద్వారా పంపిస్తాము.

(పోస్టుఖర్చులు దాదాపు 5/- మేము భరిస్తాము)

* రేపు మాసపత్రిక సం॥ చందా నిమిత్తం వి. పి. పి. తెచ్చిన పోస్టుమాన్‌కు రూ. 25/- చెల్లించండి.
* రేపు మాసపత్రిక ప్రతినెలా మొదటివారంలో మీకు చేరేలా పంపుతాము.

**మీజీవితాన్ని అద్భుతంగా రూపొందించే అవకాశాన్ని మాకు కల్పించండి!**




ఏలూరు రోడ్
విజయవాడ-520002.




# సత్వర నివారణకు శక్తివంతమైన మరియు విశ్వసనీయమైన అనాసిన్ తీసుకోనండి.

**ఎలియమైనది!** అనాసిన్ నొప్పిని త్వరితంగా తగ్గిస్తుంది ఎందువల్లనంటే ప్రపంచమంతటా డాక్టర్లు సిఫారసు చేసే బాధా నివారక పదార్థాలను అది ఎక్కువగా కలిగియున్నది.

**విశ్వసనీయమైనది!** అనాసిన్ డాక్టరు ఇచ్చే విశ్వసనీయమైన ప్రిస్క్రిప్షన్ లాగా ఒక మందుల మిశ్రమం. అందువల్లనే లక్షలాది ప్రజలు అనాసిన్‌ను తీసుకొంటారు మరియు సిఫారసు చేస్తారు.

*జలుబులు మరియు ఫ్లూ, తలనొప్పి, నడుము నొప్పి, కండరాల నొప్పి మరియు పంటి నొప్పికి బాగా పనిచేస్తుంది.*




శక్తివంతమైన మరియు విశ్వసనీయమైన
మేనర్స్
అనాసిన్*

భారతదేశపు ఎక్కువ జనప్రియమైన నొప్పి నివారిణి
జెఫ్రీ మేనర్స్ వారి అనాసిన్ విభాగం నుంచి

*Regd. T M

A 23-7/78 R

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938 1972]
శుక్రవారం : 5-1 '79
కాళయుక్తినామ సం. పుష్య శు. అష్టమి
సంపుటము 72 : సంచిక 17
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

# బ్రూక్ బాండ్ గ్రీన్ లేబిల్

# 3 తరాల వారికి అదే కమ్మని రుచి



గ్రీన్ లేబిల్ : అనేక సం॥లుగా బామ్మగారు దాన్ని ఉపయోగిస్తున్న విధం



గ్రీన్ లేబిల్ : అమ్మ దాన్ని ఉపయోగిస్తున్న విధం



అదే గ్రీన్ లేబిల్ : మీరు మెచ్చుకొనే విధం మరియు మీరు ఉపయోగించే విధం.

మూడు తరాల వారికి అభిమాని కావడంలో ఆశ్చర్య పడనవసరం లేదు. మరియు ఈ రోజు అందుకే అధికంగా అమ్ముడవుతుంది




**ఎల్లప్పుడూ శ్రేష్ఠమైనది, స్ట్రాంగైనది**

~ లోకం పోకడ * ఓ'మెన్ ~













మా పాఠకులకు
రచయితలకు
ఏజెంట్లకు
ప్రకటన కర్తలకు
అందరికీ ఆంగ్ల సంవత్సరాది
శుభాకాంక్షలు! —సం॥




## ముఖ చిత్రం

ఈ వారం వెలువడిన మా (మీ) ఆంధ్ర సచిత్ర వార పత్రికపై "కృప" ముఖచిత్రం (22-12-78) చాలా అందముగా ఉన్నది. చాలా రోజుల తరువాత మేము ఈ మధ్య మీ (మా) పత్రికపై నటుల యొక్క ముఖచిత్రాల్ని చూడ గలుగుచున్నాము. అందులకు సంపాదకులకు మా యొక్క హృదయపూర్వక కృతజ్ఞతలు. ఇలాగే అప్పుడప్పుడు నటుల యొక్క ముఖ చిత్రాల్ని కూడా ప్రచురించవలసినదిగా మేము కోరుకుంటున్నాము.

ప్రతిమ జయప్రద, శారద రామేశ్వరి, పద్మజ, జిన్నీ, ఉషా.... [బరంపురం]

* * *

మా అభిమాన హీరో కృష్ణగారి ముఖ చిత్రంతో వెలువడిన 22-12-78వ తేది సంచిక చాలా ముచ్చటగా ఉన్నది మీకు కృష్ణగారి ముఖ చిత్రం ప్రచురించినందులకు ధన్యవాదములు. నూతన సంవత్సరములోకి అడుగుపెడుతున్న ఆంధ్రుల అభిమాన ఆంధ్ర సచిత్ర వార పత్రికకు మా హృదయ పూర్వక శుభాకాంక్షలు తెల్పాము.

కృష్ణశ్రీ, [గుంటూరు.]

* * *

"తన్మయత్వము" బ్లాక్ అండ్ వైట్ ముఖ చిత్రం బావుంది. ఇటువంటి ముఖచిత్రాలు అప్పుడప్పుడు వేస్తున్నందుకు సంపాదకులకు ధన్యవాదాలు "అతనే ప్రఖ్యాత కార్టూనిస్ట్ పులిచెర్ల జయదేవ్ బాబు" అన్న కార్టూను వ్యంగ్యంగా చాలా బావుంది.

పరిమి వెంకటరత్నం, [గుంటూరు ]

ధర్మపథం

# మూడు రకాల వ్యక్తులు

భర్తృహరి తన సుభాషితాలలో ఉత్తమ-మధ్యమ-అధములని మానవులను మూడు రకాలుగా చెప్పి యున్నాడు. కార్యాచరణను బట్టి, పరోపకారాన్ని బట్టి ఆ భేదాలు చెప్పినట్లు చాలా మందికి తెలుసును. ఆ విధాలుగానే కాకుండా మరొక విధంగా వ్యక్తులను మూడు విధాలుగా-ఉత్తములు, మధ్యములు, అధములు అనే రీతిలోనే విభజించ వచ్చును.

"యదుపాత్తం యశః పిత్రా
ధనం వీర్య మథాపి వా,
త న్న హాపయతే యస్తు
స నరో మధ్యమః స్మృతః
తద్వీర్యా దధికం యస్తు
పున రన్యత్ స్వశక్తితః,
నిష్పాదయతి తం ప్రాజ్ఞాః
వదంతి నర ముత్తమమ్,
యః పిత్రా సముపాత్తాని
ధన వీర్య యశాంసి వై,
న్యూనతాం నయతి ప్రాజ్ఞాః
త మాహుః పురుషాధమమ్"

తండ్రి సంపాదించిన కీర్తిని, ధనాన్ని, పరాక్రమాన్ని చెడగొట్టకుండా నిలిపేవాడు మధ్యముడు. తన శక్తిని ఉపయోగించి, తండ్రి సంపాదించిన పరాక్రమం కంటె అధికమైన పరాక్రమాన్ని చూపేవాడు ఉత్తముడని ప్రాజ్ఞులు చెపుతూ ఉంటారు. తండ్రి సంపాదించిన కీర్తినీ, ధనాన్నీ, పరాక్రమాన్నీ క్షీణింపజేసేవాడు అధముడని చెప్పబడుతున్నాడు- అని పయి శ్లోకాల అభిప్రాయం.

అయితే యిది తండ్రిని మనస్సులో ఉంచుకుని చెప్పిన మాట మాత్రం కాదు మానవు లందరికీ వర్తిస్తాయి.

కొందరు స్వభుజశక్తి మీదనే ఆధారపడి ధనాన్నీ, కీర్తిప్రతిష్ఠలనూ సంపాదిస్తారు. అందువల్ల వారికే కాకుండా అటివారి వంశానికి కూడా మంచి గౌరవం వుంటుంది. ఇట్టి వానిని కన్న తలిదండ్రులు ఎంత అదృష్టవంతులో అని తలిదండ్రులకూ, వంశంలోని పూర్వీకులకూ కూడా పేరు వస్తుంది.

కొందరు సర్వ సాధారణంగా ఉండి తమ తండ్రి తాతల కీర్తి ప్రతిష్ఠలు చెడిపోకుండా మాత్రం చూసుకుంటారు. అప్పుడు వృద్ధి క్షయాలకు అవకాశం వుండదు. అట్టి వారికి తగు మాత్రం గౌరవమే ఉంటుంది. అలాటివారు మధ్యము లని చెప్పవలసి ఉన్నది.

అయోగ్యులైన కొందరు పెద్దలు సంపాదించిన ఆస్తి పాస్తులు వ్యయం చేస్తూ తాము సోమరులై కాలం గడుపుతారు. వారికి కీర్తి ప్రతిష్ఠలతో సంబంధం ఉండదు. కీర్త్యపకీర్తులకూ, మంచి చెడ్డలకూ వ్యత్యాసమే వారికి తెలియదు. ఇట్టివారు అధములు. వీరు నలుగురిలోనూ నవ్వులపాలు కాక తప్పదు.

ఆత్మ గౌరవం ఉన్నవాడు స్వయం కృషితో పెద్దల గౌరవాన్ని ఇనుమడించ డానికే ప్రయత్నం చేస్తాడు.

*-బులుసు వేంకట రమణయ్య*

---

కార్టూన్

"మావిడ ప్రసవించిందటగా రచయిత్రి-కార్టూనిష్టు" అన్న కార్టూను చాలా బాగుంది.

జి. హనుమంతరావు. [ఎనికేపాడు.]

కథలు

వర్ధమాన రచయిత శ్రీ మదవపూరి సుబ్రహ్మణ్యంగారి 'గొడుగు' కథ మా కెంతో నచ్చినది.

నిజంగా అ త్రైసరు జీతగాళ్ళ జీవితాలు గొడుగును కొన లేని పరిస్థితులలో ఉన్నవి.

హెచ్. రజని, [సిద్ధపటము.]

* * *

"భగవాన్ ఏమిటిది?" కథ మాకు బాగా నచ్చినది. రచయితకు మా అభినందనలు.

జి వి ఎస్ ఎస్ శర్మ. ఎస్. రమేష్. ఎస్ సురేష్. [కొత్త పాల్వంచ]

* * *

15-12-78వ తేదీ "నటి శైలజ" ముఖచిత్రంతో వెలువడిన పత్రిక ఎప్పటిలాగానే, నీటుగా, మంచి మంచి శీర్షికలతో వెలువడింది. కథలలో "గొడుగు", "ప్రయాణం" చక్కగా ఉన్నాయి. "జర్మన్ మహిళల దృక్పథంలో మార్పు" విజ్ఞానానికి ఈవారంపత్రికకే "హైలైట్"గా ఉంది. "ఆకర్షణ-వ్యామోహం" సీరియల్ చాలా బాగాసాగుతోంది. కవనశర్మగార్కి, ప్రచురిస్తున్న మీకు మా ధన్యవాదాలు.

పెన్మెత్స సూరిబాబు. పి.యస్. రాజు, భాస్కరరాజు, [హైదరాబాద్.]

* * *

8-12-78 తేదీ సంచికలో ప్రచురించిన గొట్టిగుండాల ఇందిరాదేవిగారి కథ "అభిమానం బటువు" కథ మమ్మల్ని ఎంతో ఆకర్షించినది. ఇంత మంచి మంచి కథలు ప్రచురిస్తున్న మీకు మా కృతజ్ఞతలు.

కంచర్ల వెంకటేశ్వరరావు. ప్రభావతి, [పోరంకి.]

* * *

ఈ వారం కథలన్నీ బాగున్నాయి, "తేడా." "మీరే చెప్పాలి!" కథలు చిన్నవైనా మెచ్చుకోలుగా వున్నాయి. పెళ్ళిచూపుల విషయంలో నేటి యువతులు అవలంభిస్తున్న పద్ధతికి ప్రతిబింబం "నీరజ పెళ్ళి" కథ. ఇద్దరు స్త్రీల విభిన్న ప్రవృత్తుల మధ్య మానసికంగా వ్యధచెందిన ఒక వివాహిత పురుషుని గాథయే "రమా-నేను-సరోజా" కథ. మిగతా వ్యాసాలు, శీర్షికలు మమ్మెంతో ఆకర్షించాయి. ఇక పోతే సీరియల్స్ చాలా యింటరెస్టింగ్‌గా సాగుతున్నాయి.

విలువైన విషయాలను, ఆసక్తిదాయకమైన కథలను, సీరియల్ నవలలను అందించే మీ (మా) పత్రిక వెల చాల తక్కువేమోననిపించింది.

మంద మహేందర్, కన్యాకుమారి, రాజ్యలక్ష్మి, కౌసల్యాబాయి, జేబికాంతి, జేవి కాంతి, [హైదరాబాద్.]

* * *

15-12-78 పత్రిక ముఖచిత్రం ముద్రణ బాగుంది. కాని ముఖచిత్ర సుందరి మాత్రం అందంగా లేదు.

కథల్లో "ప్రయాణం" బాగుంది. "గవర్నెస్ కరుణ" కోణార్క్ ఎక్స్‌ప్రెస్‌లా ముందుకు సాగిపోతుంది.

"జర్మన్ మహిళల దృక్పథంలో మార్పు" విజ్ఞాన దాయకంగావుంది.

డబ్బీరు ఉదయకుమార్, అశోక్, కిషోర్, శ్రీను, మనోజ్, కె. ప్రమీల, డి. భవాని [కుర్దారోడ్]

# ఇద్దరి కథ

పాలడుగు వెంకటేశ్వరంప్ప



పగలల్లా మండినంతసేపూ మండిం ఎండ, ప్రపంచాన్ని పెండలాన్ని వేపినట్టుగ వేపింది.

చమటకారి కాంతయ్య వళ్ళు మునిగి పోయింది బనీను పూర్తిగా తడిసిపోయింది. అందులో – ఆ కొట్లో అసలే గాలి ఆడదు. వెలుతురు ఏ వేళా వుండదు ముందరి గదిలో బేరసారాలు సాగుతూవుండగా – వెనుకన వున్న ఆ చీకటి కొట్లో బుడ్డిదీపం పెట్టుకుని లెక్కలు రాస్తూ వుంటాడు కాంతయ్య.

'ఏం లెక్కలయ్యా ఇవి ?' అని దబాయిస్తాడు షావుకారు సాంబయ్య అది అతని అలవాటూ.

'ఈ లెక్కలన్ని తీసుకెళ్లి ఇనకంటాక్సోళ్ళకీ, సేల్సుటాక్సు వోళ్ళకీ సూయించామంటే కొంప సుండమయిపోద్ది. అసలే పిల్లల గతేంద్రి, నన్ను ముంచకు నాయనా!' అంటాడు షావుకారు. అది అర్థింపు గాదు; దబాయింపు. ఆ షావుకారుకి పొట్టకోస్తే అక్షరముక్క లేదు. కాని ఆ పొట్టనిండా తెలివి తేటలే! ఆ తెలివితేటల్నే పెట్టుబడిగా పెట్టి మేడలు కట్టాడు! కాంతయ్య ఆ లెక్కల్ని చదివి వినిపిస్తే – అందులో లొసుగుల్ని క్షణంలో ఇట్టే పట్టేసి – ఏది ఏ రకంగా రాయాలో వివరంగా చెపుతాడు! లెక్కల్ని నీటుగా అలాగ రాయించుకుని పక్కద్దీగా వుంచుతాడు. చెకింగుకని ఏయువంటి మనిషి వచ్చినా, వాడ్ని ఇట్టే పసిగట్టేస్తాడు. వీలైతే బెదిరించి దబాయిస్తాడు. లేకుంటే ప్రాధేయపడతాడు. ఏలాగయితే నేం ? తను అనుకున్నది సాధించ గలుగుతాడు. సాంబయ్యకి నలుగురు కొడుకులు–

పెళ్ళిళ్ళయ్యాయి. నాలుగూళ్ళల్లో వున్న వ్యాపారాల్ని నలుగురు కొడుకులకీ అప్పజెప్పి ఈ వూళ్ళో వ్యాపారాన్ని స్వయంగా చేస్తున్నాడు. ఇద్దరు కూతుళ్ళకి పెళ్ళయింది. ఒకల్లుడు డాక్టరు అమెరికాలో వుంటున్నాడు రెండవ అయన పెద్ద ఇండస్ట్రియలిస్టు. హైదరాబాదులో వుంటాడు.

కాంతయ్య ఆ వూరి స్కూల్లో మాస్టరుగ వున్న రోజుల్లో ఆ షావుకారుతో పరిచయం అయింది అతని కొడుకులు కాంతయ్య దగ్గర చదువుకున్నారు అందరూ బండలే తన కెలాగూ చదువు అబ్బలేదు. కనీసం కొడుకులకయినా చదువు వస్తే బావుణ్ణని తాపత్రయపడ్డాడు సాంబయ్య. 'మా వాళ్ళని బాగా తోమండి బాబా! నాలుగక్షరమ్ముక్కలు వచ్చేటట్టు సేయండి' అని ప్రాధేయపడి అడిగాడు. కాని ఎంత తోమినా – ఏక బాదినా – చింత బరికెలు విరిగేవిగాని ఆ బుర్రల్లోకి అక్షరమ్ముక్కలు అసలు ఎక్కేవిగాదు. అందువల్ల జాలిపడి వాళ్ళని వదిలేసేడు కాంతయ్య. ఆ చదువులు నానాకాలపు చదువుల్లాగా మధ్యలోనే ఆగి పోయేయి అది గత చరిత్ర.

కాని – ఆ చేతిమీదుగానే మెరికల్లాంటి కుర్రాళ్ళని తీర్చిదిద్ది పై చదువులకి పంపేడు కాంతయ్యగారు. వాళ్ళందరూ ఇప్పుడు అంతగా జ్ఞాపకంలేదు గాని బాగా పైకి వచ్చి వుంటారని అయన నమ్మకం. కాంతయ్యకి ఇపుడు వయస్సుతోపాటు శక్తి జ్ఞాపకశక్తి, తగ్గిపోయేయి. చూపు కూడా అంతంత మాత్రమే, అయి కళ్ళజోడు తప్పని సరయింది. ఏందుకయినా మంచిదని పలకరించిన ప్రతి వాడికీ నమస్కారం పెడ్తాడు కాంతయ్య. నమస్కారం. నమస్కారమంటే పురుస్కారం సారు – ఇవి అయిన నమస్కార బాణాల రూపాంతరాలు. అతని బలహీనతల బాహిర ఆకారాలు.

ఆర్థిక పరిస్థితి కాంతయ్యని దెబ్బ తీసింది. బాగా క్రుంగిపోయాడు. మానసికంగా పిరికిలాగా దోమలాగా అయి పోయాడు. ఒకనాటి 'ప్రెస్టేజి' ఇప్పుడు నూదిలాగయింది.

'నీ నమస్కారాలు పాడుగాను పంతులూ! నమస్కారానికొక రూపాయి లెక్కన ధర పలికినా కొన్ని వేల రూపాయిలు అపును'

అని నవ్వుతాడు షావుకారు సాంబయ్య.

కాంతయ్య సిగ్గుపడి తల వంచుకుంటాడు— రిటయిరయాక కాంతయ్య చితికిపోయేడు. షావుకారికి కాంతయ్యమీద ఏమాత్రం గౌరవం లేదు. జాలి అసలేలేదు. మరి అతన్ని ఎందుకు పెట్టుకున్నాడంటే అవసరం వల్లనే అనాలి. ఆ ముసల్సనంలో వాళ్ళు రెండే శాల్తీలు. గ్లాసుడు మజ్జిగ తాగిఅయినా సరిపెట్టుకుంటారు. పింఛను పైసలు వుండనే వున్నాయి. అందువలన నెలకి యాభయి రూపాయలు మాత్రమే పుచ్చుకుని— ఏమన్నా పడివుంటూ— పైగా నమస్కార బాణాలు పడేస్తూ— తను చెప్పి నట్లు అడ్డమయిన లెక్కలూరాసి, తిరగరాసి అరవచాకిరీ చేస్తాడు గనుక తన అవసరం గడుపుకోవటానికి కాంతయ్యని పెట్టుకున్నాడు షావుకారు. చీప్ అండ్ బెస్ట్.

అయితే— ఆ సంపాదన మీదనే ఆధారపడి కాంతయ్యని మహా ఇరకాటంలో పెట్టటానికి, కాంతయ్యా— అతని భార్యేగాక అతని తమ్ముడి కుచేల సంతానం వుంది. అతని తమ్ముడు లారీ డ్రయివరు. అప్పుడెప్పుడో ఒక యాక్సిడెంటులో అతను హఠాత్తుగా పోయాడు. అందువలన ఆ అభిమానంతో వాళ్ళని ఆదుకుంటానికి నిశ్చయించుకుని ప్రతి నెలా ఎంతో కొంత పంపటం మొదలు పెట్టాడు కాంతయ్య. అది అలా సాగి ఆనవాయితీగా అయింది. ఏ నెలలోనయినా పైకం అందటం కొంత ఆలస్యమయితే 'ఆవిడ' నిష్ఠూరిస్తూ ఉత్తరం రాస్తుంది. కాదంటే తనే దిగుతుంది. ఆమె నోరు పెద్దది. ఆమె నోరు విప్పితే కాంతయ్య వంశవృక్షాన్ని సమూలంగా ప్రక్షాళనచేస్తుంది. అందువలన ఆమె అంటే కాంతయ్యకి భయం, దిగులూ. కాంతయ్య భార్య అతనికన్నా అన్యాయం. ఆ కారణంగా పింఛను అందకపోయినా, షావుకారు జీతం యివ్వటం ఆలస్యం చేసినా, అప్పుచేసయినా సరే మరదలుకి మనియార్డరు పంపుతాడు కాంతయ్య నెల నెలా. అది తప్పదు; తప్పించుకోలేని బాధ్యత అని కాంతయ్య ఉద్దేశ్యం. అందువలన— షావుకారు గాని, మిగిలిన పరిచయస్తులు గాని కాంతయ్య బడ్జెటు గురించి ఏ అంచనా వేసినా— అసలు పరిస్థితి ఏమంటే అతనికి తలనిండా అప్పలున్నాయి. లోపలి బనీను నిండా చిరుగులే! పై చొక్కాకి అతుకులున్నాయి. కాంతయ్య భార్యకి రెండే రెండు చీరలున్నాయి. కాంతయ్యకిపాపభీతి మెండుగ వుంది. తను— తన తమ్ముడి సంసారాన్ని గురించి పట్టించుకోకపోతే- ఆ తమ్ముడి చనిపోయిన ఆత్మ క్షోభించి తనని శపిస్తుందనీ ఆ శాపానికి గురయి తను మరు జన్మలో కుక్కగానో, పిల్లిగానో అయి పోతాడని కాంతయ్య దృఢమైన విశ్వాసం!

అందువలన కాంతయ్యకి కూరల దుకాణంలో అప్పు వుంది. బట్టల కొట్లో క్రిందటి దీపావళికి— మరదలికీ ఆమె సంతానానికీ పెట్టటానికి తీసిన బట్టల తాలూకు అప్పు అలాగే వుంది. కిరాణా కొట్లో వున్న ఖాతా అప్పటికంటే పెద్దది. స్నేహితులవద్ద చేసిన చేబదుళ్ళు ఎన్నో వున్నాయి. వాళ్ళందరూ దొరికినప్పుడల్లా కాంతయ్యని పట్టుకుని దులుపుతారు. నిలబెట్టి అడుగుతారు.

'ఏమండోయి పంతులు గారూ! మమ్మల్ని మరిచేపోయారు!'

'ఆఁ. సాయిబు గారూ. నమస్కారం. నమస్కారమండీ. బాగున్నారా?'

'ఏం బాగు మహానుభావా? మీలాగ నాల్గు ఖాతాలు దొరికితే నేను దివాలా తీయటం ఖాయం.'

'అదేం గాదులెండి. భగవంతుడు మిమ్మల్ని చల్లగా చూస్తాడు.'

'అది సరేలెండి. మా కుర్రాడ్ని మీ ఇంటికి రోజూ పంపుతున్నాను. బాకి చెల్లు వేయించరు. ఎలాగ చెప్పండి?'

'వేయిస్తాలెండి, రేపు ఫస్టుకి.'

'ఆఁ. ఇలాటి ఫస్టులు ఎన్ని పోయాయి? మేం బతకాల్నా? ఆడుక్కొంటానికి తయారవాల్నా?'

'ఈసారి తప్పకుండా ఇస్తాముగా.'

'ఏదో దయుంచండి మరి. అడిగి అడిగి మా నోరు నొప్పిపెట్టటమే మిగిలింది.'

'అలాగే. నమస్కారం. మరి వస్తాను.' అని సాగిపోతాడు కాంతయ్య. కాంతయ్యవి పాము చెవులు. ఎవడయినా అప్పలు ఇచ్చిన వాడు అంత దూరాన్న వున్నా ఇట్టే పసిగట్టేస్తాడు— పక్కదారి పట్టబోయేలోగానే —యమ భటుడిలాగ వచ్చి పట్టుకుంటాడు, అవతలివాడు పంపిన ఆ మనిషి.

'ఓ మీరా. నమస్కారం. నమస్కారమండి!' అంటాడు కాంతయ్య నవ్వుతూ.

'ఇవన్నీ నాకెందుకుగాని మా "సేటు" రమ్మన్నాడు. పదండి' అని రెక్కపట్టుకుని లాక్కుపోతాడు వాడు. ఆ సేటు మీద నమస్కార వర్షం కురిపిస్తాడు కాంతయ్య. కాని—అని అవతలివాడి బండతనం ముందు —దున్నపోతు మీద వాన కురిసినట్లే! వాడికి బాకీ వసూలు కావాలి గాని నమస్కారాలెందుకు? అందువలన అవతలివాడు కాంతయ్యని ఉతికి ఆరేసినంత పని చేసి వదుల్తాడు. చివరికి మరల నమస్కారం



# ఆ ఇద్దరికథ

పడేసి ఇవతలవాడి గాలి పీల్చుకుంటాడో కాంతయ్య. ఇదీ తంతు.

'ఒరే కాంతయ్యా నా మీద దయదల్చి నా డబ్బు నాకు పారేయరా బాబు.'

'ఓరి కాంతిగా! నీకు బుద్ధి వుందా? నన్నెందుకు ఏడిపిస్తావురా?' 'రామరామ, వీరక్క నీ వలలో పడ్డాను గదరా. రెండ్రూపాయల వడ్డీ గదా అని ఆశపడి బుద్ధిగడ్డి తిని నీకు అప్పు పెట్టాను. ఆ వడ్డీ సంగతి దేముడెరుగు. అసలు నయినా నా మొహాన కొట్టరా. ఏదో ప్రఫంద్స్వామి అంటూ ఏడుస్తున్నాంగదా మనం.'

అప్పులిచ్చిన స్నేహితుల పలకరింపులు అలాగవుంటాయి. 'నమస్కారాలు. అందరిక్కీ నమస్కారాలు. తప్పకుండా సర్దుతాను. మీ బాకీ అసలు ఫాయిదాలు పువ్వుల్లో పెట్టి టెప్పు పూచీ నాదీ' అని గ్యారంటీ ఇస్తాడు కాంతయ్య.

కాని ఇలాంటి గ్యారంటీలు విన్నీ పుచ్చిపోయారు వాళ్ళు. ఎగగొట్టాలనేంగాదు. అంతలా వుద్దేశ్యమేలేదు కాంతయ్యకి. ఏవరి బాకీ వాళ్ళకి ఫైసలు చేసి ఇచ్చేసి వాళ్ళని సంతృప్తి పరచాలనే ప్రయత్నం. కాని ఆ ప్రయత్నం నెరవేరే దారే లేదు. తీవ్రంగా ఆలోచిస్తాడు. సంపాదన పెంచటానికి రకరకాల ఆలోచనలు చేస్తాడు. అవి ఆలోచనలుగానె మిగిలిపోవటానికి కారణం వుంది. పిశాచంలాగా పట్టుకుంటాడు షావుకారు. ఒకటికి నాల్గుసార్లు లెక్కలు రాయాలి; మార్చి మార్చి రాయిస్తేనే షావుకారికి తృప్తి. రాసి రాసి రోజూ చేతులు పీకి నడుములు విరిగినంత పనవుతుంది. ఆ పైన చీకట్లో దిగుమతి దిగుమతుల వ్యాపారాలు. అటువంటి వాటికి నమ్మకస్తుడయిన మనిషి కావాలి. షావుకారు సాధారణంగా ఎవర్నీ నమ్మలేదు. అందువలన ఆ పనీ కాంతయ్యే చెయ్యాలి. పన్లన్నీ ముగించుకుని తాళాలు అప్పజెప్పి నమస్కారం పెట్టి ఇల్లు చేరే సరికి పదవుతుంది. ముసలమ్మ కని పెట్టుకునే వుంటుంది. ఆమె గాజు కళ్ళతో కాంతయ్య కోసం చూసి చూసి అతను ఇల్లు చేరగానె ఏంతో సంబర పడుతుంది. అదనీ ఇదనీ నాలుగు కబుర్లు చెప్పుకుని ఇంత ముద్దా ఇన్ని మజ్జిగ నీళ్ళూ తాగి పడుకుంటారు ఇద్దరూ. ప్రాణాలు తెల్లారే దాకా ఏటో పోయి షికార్లు చేస్తాయి.

ఆకాశాన అంతలోనే మబ్బులు క్రమ్ముకుని వచ్చాయి. నల్లగా చీకటి ముసిరింది. పగలే చీకటిగా అయింది. గోడ గడియారం వయిపు చూసాడు కాంతయ్య.

అయిదయింది. మరి కాసేపటికి ఆరూ అయింది.

తళుక్కున మెరుపు మెరిసింది. ఫెళ్ళున ఉరుము ఉరిమి పిడుగు పడింది.

'అర్జున, ఫల్గుణ, పార్థ, కిరీటి, విజయ...' అంటూ పఠించాడు కాంతయ్య.

మరదలూ, తమ్ముడి పిల్లలూ వచ్చి నాల్గు రోజులయింది. అసలే ఇరుకయిన యిల్లు. ఇల్లు సంతలాగ అయింది. ఈసారి మరదలు చాలా పెద్ద నోరు పెట్టుకుని భయంకరమయిన 'డిమాండు'లను ప్రవేశపెట్టింది. పిల్లలెవరికీ మంచి బట్టలు లేవు. తనకీ లేవు. బయట తిరగాలంటేనే సిగ్గుగా వుంది. నలుగుర్లో పడవటం భయం కలిగిస్తోంది. పైగా బావగారు పంపుతున్న డబ్బు చాలక అప్పు అయింది. ఆ అప్పు రెండొందలూ తీరుస్తావా ఛస్తావా



సంపూర్ణ ఆరోగ్యానికి 3000 ఏండ్లనుంచి ప్రఖ్యాతిపొందిన

డాబర్ చ్యవనప్రాశ కుటుంబ ఆరోగ్యాన్ని నాలుగువిదాలుగా మెరుగుపరుస్తుంది.




1. శరీర కణాలను నిత్యం యవ్వనంతో ఉంచుతుంది.
డాబర్ చ్యవనప్రాశ శరీర కణాలు అరిగి, తరిగి పోయే ప్రక్రియా వేగాన్ని తగ్గిస్తుంది.

2. శరీర రోగ నివారణశక్తి పెంచుతుంది.
డాబర్ చ్యవనప్రాశ మొత్తం శరీర రోగ నివారణ శక్తి పెంచుతుంది. దగ్గు, రొంప నివారణకు కూడా మంచిది.

3. చురుకుదనం పెంచుతుంది.
డాబర్ చ్యవనప్రాశ పిల్లలలో చురుకుదనం పెంచుతుంది. వృద్ధాప్యంలో మానసిక, శారీరక శక్తులను పెంచుతుంది.

4. జీవకణ నిర్మాణ శక్తి.
డాబర్ చ్యవనప్రాశ శరీరం క్రమంగా పెరిగి, దారుఢ్యంగా ఉండటంలో తోడ్పడుతుంది.

దేవతల వంటకం
3000 ఏండ్ల క్రితం, చ్యవనమహర్షి ఋషి తన యవ్వనాన్ని తిరిగి పొందేందుకు, దేవతల వైద్యులు అయినవారు చ్యవనప్రాశ వాడమన్నట్లు చెబుతారు. ప్రపంచంలోని ప్రాచీన టానిక్ అయిన చ్యవనప్రాశను, ఇప్పుడు డాబర్‌వారు ఆధునికంగా, రుచిగా, తయారు చేస్తున్నారు

1 కి.గ్రా. డబ్బాతో చెంచా ఉచితం

ఆరోగ్య పరిరక్షణకు ఆయుర్వేద కోసం డాబర్ చ్యవనప్రాశ

డాబర్ చ్యవనప్రాశ

అన్ని మందుల దుకాణాల్లోనూ, కెమిస్టుల వద్దా లభిస్తుంది.

అని అప్పుల వాళ్ళు నెత్తి మీద కూర్చున్నారు. అది అంతా ఏకరువు పెట్టి 'ఏమంటారు?' అని నిలదీసింది మరదలు. ఆమె మాటని కాదనలేదు కాంతయ్య. కాదంటే ఆమె అరుస్తుంది. శాపనార్థాలు పెడుతుంది. పితృదేవతల్ని అందర్నీ అందులోకి ఈడుస్తుంది. అందువలన— 'తప్పకుండా చూద్దాం' అన్నాడు కాంతయ్య.

'చూద్దామంటే కాదు. పరువు ప్రతిష్ఠలకి సంబంధించిందీ వ్యవహారం. నా పరువు పోతే ఒకటీ మీ పరువుపోతే ఒకటీనా? ఫలానా వారితమ్ముడుగారి సంసారం అంటే ఛీ అని పురుగులాగా తీసిపారేస్తే అది ఎవరికి? మీకు కాదూ?' అంది ఆమె. మాటిగా, 'అవునవును' అని బుర్ర వూపాడు కాంతయ్య. అతని బుర్ర తిరిగి పోయింది.

'నేను ఈ రోజే వెళిపోతాను. పిల్లలకి బళ్ళు తెరుస్తారు. ఆపైన అత్యవసరమయిన పన్లు వున్నాయి.' అంటూ ఆ ఉదయమే చెప్పింది ఆమె. తల వూపి— కాంతయ్య బయటికి రాబోతూ వుండగా ముసలావిడ వచ్చి గుసగుసగా చెప్పింది.

'బియ్యం నిండుకున్నాయి— తీసుకుని పెందరాళే రాండి.'

'అలాగా!!'

'అవును. బియ్యం సాయంత్రం వచ్చేటప్పుడు తెండి. అసలే చుట్టాలు వచ్చి వున్నారు.'

'అవునవును. చుట్టాలు వచ్చి వుంటిరి' అన్నాడు.

'మర్చిపోకండేం?' బ్రతిమాలుతున్నట్లు అంది. మరదలూ ఆమె పిల్లలూ రాక్షసుల్లాగ తింటారు! తల వూపాడు కాంతయ్య.

వర్షం మొదలయింది. ఆ మధ్యాహ్నమే ఎవరో నలుగురు అపరిచితులు వచ్చి షావుకారుతో గుసగుసలాడి వెళ్ళేరు. అప్పట్నుంచీ షావుకారు తెగ వుషారుగా వున్నాడు. ప్రపంచాన్ని గజగజలాడిస్తూ కుండపోతగా వర్షం కురిసి వెలిసింది. మెయిన్ రోడ్డు నిర్మానుష్యమయింది. చీకటికమ్ముకుని వచ్చింది. కొట్టు ఖాళీ అయింది. ఎవరూ లేరు. షావుకారు విశ్రాంతిగా కాళ్ళు బారచాపుకుని పాడుతున్నాడు భక్తిరంజని కీర్తనలు!

'నమస్కారం' అన్నాడు కాంతయ్య అతని దగ్గరకి వెళ్ళి నుంచుని.

షావుకారు వులికిపడి పద్యాలు ఆపాడు. తీవ్రంగా చూసాడు.

'ఓరి నీ బండపడ. కథగారు పెట్టావు గదయ్యా. ఏంటికతా? అప్పుడే పనిమించి లేచి వచ్చేసావూ?! ఇవాళ బాగా పనుంది కూడాను' అన్నాడు షావుకారు దబాయిస్తూ.

అని ముసి ముసిగా నవ్వాడు.

చిటికలు వేసాడు. కోతిచేష్టలు చేసాడు. కాంతయ్య వినయ వినమిత శిరస్కుడయి— చుట్టాలు వచ్చిన ఆ సమయంలోనే తన ఇంట్లో బియ్యం నిండుకున్న వైనమూ, మరదలి పిల్లల కొత్తబట్టల వ్యవహారమూ —ఆమె నెత్తిమీద వున్న అప్పు విషయమూ, అంతా వివరంగాచెప్పాడు. చెప్పి 'నమస్కారం సార్. మిమ్మల్నే నమ్ముకున్నాను.' అని భయంతో ఆందోళనతో తన సమస్యని షావుకారు ముందుంచాడు.

'సాంబయ్య' షావుకారు పకపక నవ్వాడు. లక్ష్మీదేవి గజ్జెలు గల గల మన్నట్లయింది.

కాంతయ్య తల వంచాడు. సరస్వతి సిగ్గుపడి క్రుంగిపోయింది.

'ఆఁ. అదన్నమాట సంగతి. సరే. అట్లాగే చూద్దాము. కాని అంతకంటె అర్జంటుగా నువ్వు ఇప్పుడు ఒక ముఖ్యమయిన పని చెయ్యాలయ్యా' అన్నాడు. అని గుస గుసగా ఏం చెయ్యాల్సిందీ కాంతయ్య చెవిలో చెప్పాడు.

షావుకారు కొట్టు మెయిను బజార్లో వుంది. అది వెనకాల వున్న సందువరకూ విస్తరించి వుంది. ఆ వెనక గదులన్నీ గోడవున్లు. కాంతయ్య ఆ సందులోకి వెళ్ళేసరికి అక్కడ ఒకలారీ ఆగివుంది. చిన్న లాంతరు పెట్టుకుని ఎదురు చూస్తున్న నలుగురు మనుషులు కాంతయ్యని చూసి లేచారు.

ఆ వెంటనే పని ప్రారంభమయింది. పాలడబ్బాలు, పంచదార బస్తాలు, కిర్సనాయిలు డబ్బాలు చక చకా లారీ నుంచి గోడవున్లోకి చేరుతున్నాయి. అవన్నీ లెక్కపెట్టి కాగితంమీద వేస్తున్నాడు కాంతయ్య. ఉషారుగా పైనుంచి చూస్తూ లోట్టలు వేస్తున్నాడు షావుకారు. దేవుణ్ణి తలచుకుని మొక్కుతున్నాడు లోపల్లోపల.

సడన్‌గా అక్కడ— ఫ్లడ్ లైట్స్‌లాగా వున్న బ్యాటరీలయిట్లు గమ్మున వెలిగాయి! విజిల్సు మ్రోగాయి! టక టక చప్పుడు చేసుకుంటూ పోలీసులు వచ్చి చుట్టుముట్టారు వాళ్ళని. షావుకారు సాంబయ్య గజగజ వణికిపోయాడు. నోటమాట రాని షావుకారుకి ముచ్చెమటలు పోసాయి. 'నా కొంప మునిగిందిరా నాయనా' అనుకున్నాడు. గజ గజ వణికాడు. అందర్నీ పట్టుకుని, ఫోటోలు తీసుకుని కాగితాలు రాస్తున్నారు— పోలీసులు. ఆ ఫొటోగ్రాఫరు ట్రయినింగవగానే అక్కాగే వచ్చాడట. వచ్చి నెలయినా కాలేదు. అప్పుడే దొంగ వ్యాపార్లకి సింహస్వప్నంలా తయారవగానే.

## అంతరిక్షంలో సోవియట్—భారత్‌ల నూతన ప్రయోగం

భారతీయ రెండవ ఉపగ్రహం సోవియట్ భూభాగం నుండి, సోవియట్ రాకెట్‌ద్వారా ప్రయోగింప బడుతుందని సోవియట్ విజ్ఞాన శాస్త్ర పరిషత్తు అంతర్ కాస్మోస్ మండలి ఉపాధ్యక్షులు నికొలాయ్ నోవికోవ్ 'టాస్' వార్తా సంస్థకి చెప్పారు.

ఈ రెండవ ఉపగ్రహం, తొలి ఉపగ్రహం 'ఆర్యభట'కంటె, పరికరాల విషయంలోనూ, లక్ష్యసాధనా విషయంలోనూ పూర్తి భిన్నమైనదనీ, అంతరిక్షం నుండి భూమి ఉపరితలాన్ని పరిశోధించడం దీని ప్రధాన లక్ష్యమనీ ఆయన చెప్పారు.

దీని ప్రయోగానికి సోవియట్ యూనియన్ రాకెట్‌లు, దీనిని కక్ష్యలో ప్రవేశపెట్టేందుకు అవసరమైన యంత్ర సముదాయాన్ని అందిస్తుందని చెప్పారు. ఈ ఉపగ్రహాన్ని అజమాయిషీ చేసేందుకు, దాని నుండి సమాచారాన్ని సేకరించేందుకు భూ కేంద్రం "మెద్వెజి ఒజెరా" భారతీయ ప్రవీణుల అధీనంలో వుంటుంది!

ఖగోళ పరిశోధన కోసం సోవియట్ — భారత దేశాలు సమిష్టిగా బెలూన్లను త్వరలోనే ప్రయోగించ మన్నట్లు నోవికోవ్ తెలిపారు. భారత దేశం తయారు చేసిన బెలూన్ల సహాయంతో గామా ఖగోళ పరిశోధనల రంగంలో ప్రయోగాలను గురించిన సమస్యలపై సోవియట్— భారత ప్రవీణులు చర్చలు జరిపారని ఆయన వివరించారు.

జని అందరూ చెప్పుకున్నారు. బాగా బ్రిస్క్టటం. పట్టుబడితే ఇక ఎవడయినా అంతే! ఆ సంగతి షావుకారుకీ తెలుసు. తెలిసే నిర్లక్ష్యం చేసాడు. రెడ్ హాండెడ్‌గా పట్టుబడ్డాడు. గిల గిల లాడాడు. లబ లబ మన్నాడు సాంబయ్య.

'నమస్కారం సార్. బుద్ధి గడ్డి తినింది. క్షమించాలి. ఈ ఒక్కసారికీ నన్ను వదిలేయండి. అయ్యా ఇవి చేతులు గాదు, కాళ్లనుకోండి. అసలు నాకేం తెలీదంటే తెలియదు సార్. నమ్మి ఈ కాంతయ్య చేతిలో పెట్టాను. ఇతనే వాళ్లతో లాలూచి అయి ఇలాగ నన్ను ముంచాడు. ఇతను మామూలు మనిషి గాదుసార్. దొంగ. గుంటనక్క. ఇతనికి ఈ వూరి నిండా అప్పులేనండి. కావాలంటే ఎవర్నన్నా అడగండి చెప్తారు. బుద్ధి సుద్ధి వచ్చిం దన్నానుగా. లెంపలు వేసుకుంటాను. వదిలేయండి సార్. మీకు కోటివేల నమస్కారాలు...' షావుకారు చెప్తున్నాడు. నమస్కారాలతోనయినా తప్పించుకోవటానికి ప్రయత్నించాడు. నవ్వుకుంటూ తన పని తాను చేసుకుని పోతువున్న ఆ కుర్ర ఆఫీసరు ఆగాడు. ఆగి తలెత్తి చూసాడు సూటిగా తీక్షణంగా.

'ఎవరండీ కాంతయ్య?' అన్నాడు. కుతూహలంగా చూసాడు. పరీక్షగా వెతికాడు.

'ఇడుగో, ఇతనేనండి. చూడండి. గుంటనక్క, మిడిగుడ్లు, దొంగచూపులు, నక్క వినయాలు, నమస్కారాలయితే దిన్నాయినా పెడతాడు. కాని - అమ్మో! ముంచేస్తాడు సార్. నిలువునా ముంచుతాడు. ఏమయ్యా ఎందుకు చేసావయ్యా. ఈ పాడుపని? నాతో చెప్పనైనా చెప్పలేదు! నా కొంప ముంచావు గదయ్యా...' షావుకారు వాక్ప్రవాహం ఆగింది. ఆ ఆఫీసరు లేచాడు. లేచి కాంతయ్య దగ్గరకి వచ్చాడు. వినయంగా తలను కొద్దిగా వంచి- 'నమస్కారం మాస్టారూ!' అని సూటిగా కాంతయ్య కళ్లల్లోకి చూసాడు. వాడిగా సూటిగా వున్న ఆ చూపుకి కాంతయ్య వులికి పడ్డాడు. 'నన్ను గుర్తుపట్టలేదా మాస్టారూ. విజయ రామారావునండి. వాన పాముల స్కూల్లో మీ దగ్గర చదువు కున్నాను. మీరు ఇక్కడ వున్నారా? ఇదేమి టండీ?!'

# ఆ ఇద్దరికథ

కాంతయ్య తల వంచాడు. నోరు కట్టేసి నట్లయింది. చచ్చిపోయినా బావుణ్ణనిపించింది.

'సరే! మీరు వెళ్ళండి మాస్టారూ. అవసరమయితే మీరు రేపు వద్దురుగాని. ఈ మనిషి మాటలు నాకు నమ్మదగ్గవిగా లేవు. మేము చూసుకుంటాములే. మీరు వెళ్ళిరండి మాస్టారూ! నమస్కారం.'

కాగితాల తతంగం పూర్తి చేసుకుని షావుకార్ని పట్టుకుని వాళ్ళు వెళ్లిపోయారు.

కాంతయ్య కళ్ళవెంట గిర్రున నీరు తిరిగింది. మనసు నిండా భయం. గుండెలు గుబగుబలాడాయి. ఇల్లు జ్ఞాపకం వచ్చింది. రోడ్డునపడి ఇంటివయిపు సాగాడు, పిచ్చి వాడిలాగా తూలుతూ. నల్లగా కాటుకలాగా


త్వరలో

జీవిత

మాధుర్యం

సీరియల్


వుంది చీకటి. పైన ఆకాశంలో దట్టంగా మబ్బులు వున్నాయి. ఏ నిముషంలో నయినా వాన కుంచేసేట్టు వుంది. వీధులు నిర్మానుష్యంగా వున్నాయి. ఆ విజయ రామారావు, కాంతయ్య మనసులో తుఫాను పుట్టించాడు.

అపుడు కాంతయ్యకి ఎదురుగా ఒక ఆకారం వచ్చింది- ఆ చీకట్లో తడుముకుంటూ. అలాగ వచ్చి- 'ఎవరదీ?' అని అడిగింది. ఆ ఆలోచనల్లోంచి బయటపడి వులికిపడ్డాడు, కాంతయ్య. న...న...'నమస్కారమండి. నాపేరు కాంతయ్య. రిటైర్డు స్కూలు మాస్టర్ని' అన్నాడు.

'చాల్లెండి. నాతోకూడా మీ చమత్కారాలు!' అన్న మాదట గుర్తుకి తెచ్చుకున్నాడు.

'ఎవరూ ముసలావిడా?' అన్నాడు కాంతయ్య ఆ గొంతుని గుర్తుపట్టి.

'ఆ! నేనేనండి.

'పెద్దమ్మీ, ఏమిటిలా వచ్చావు?'

ఆమె అంది- 'మీ గురించే. ఇంత సేపటికి రాకపోయిరి! ఏమయారోనని భయం వేసింది.'

'ఇంట్లో ఒంటరిగా మరదల్ని బిడ్డల్ని వదిలి వచ్చావా?' అన్నాడు బాధ్యతని గుర్తు చేస్తూ.

'తనకి- బాగా మర్యాదలు జరగలేదని మీ మరదలు అలిగింది. ఎంత చెప్పినా వినకుండా శాపనార్థాలు పెట్టి ఆమె వెళ్ళిపోయింది. అక్కడికీ అప్పో సప్పో చేసి నాకు చాతనయిన మర్యాదలు చేసాను. ఆమెకి ఏ లోటూ రాకుండా చూసాను. కాని ఆమెకి తృప్తి లేదు.'

'అయ్యో'- విలవిలలాడాడు కాంతయ్య.

'ఎందుకు అంత బాధపడతారు?'

'పెద్దమ్మీ. బాధగాక మరేమిటి? వాళని ఎలాగ వెళ్ళనిచ్చావు? పితృదేవతలు ఎంతగా క్షోభిస్తారో?! అది పూరికే పోతుందా?' గిలగిలలాడాడు కాంతయ్య.

'నా బొంద. పోతే పోనీండి. అంతకన్న నేనేం చెయ్యను?' ఎదురు తిరిగింది.

'నీకు ఒక నమస్కారం ముసలావిడా! తప్పంతా నాదే ఏ అరిష్టమయినా ఆ బాధ్యతా బరువూ అంతా నాదే. ఇంతకి క్రితనే ఒకాయన నన్ను నమస్కారం మాస్టారూ అన్నాడు ఎంతో గౌరవం అభిమానం చూపించాడు. ఆయన నాదగ్గర చదువుకున్నాడట! సిగ్గుతో చితికిపోయాను. అభిమానం చచ్చి అవమానంతో క్రుంగిపోయాను. నా కళ్ళవెంబడి కన్నీరు వరదలుగా కారింది' అన్నాడు కాంతయ్య.

'అవమానం ఏముంది ఇందులో! గురువుని గుర్తించి గౌరవం చూపించాడు.'

'కాదులే. చాలా ఘోరమయిన అవమానమే వుంది ఇక్కడ! పింఛను పుచ్చుకున్నాక ఇన్నేళ్ళు నేనే- ఎందరో అపాత్రులకి నమస్కారాలపరంపర కురిపించాను. ఇప్పుడు అతను ఒకే ఒక్క ఆ నమస్కారంతో- నా అల్పత్వాన్ని ఎత్తి చూపి ఘోరమయిన అవమానానికి నన్ను గురి చేసాడు. నేను బాధతో సిగ్గుతో చితికి

పోయాను. నా మనసు నింత క్షోభకి లోనయిందో ఎలా చెప్పను? ఎలా నీకు చెప్పగలను?'

ఆమెకి అంతా అర్థమయింది. కాశితయ్య పడుతున్న క్షోభ అంతా గద్గదమయిన అతని గొంతు పలికింది. దగ్గరగా వచ్చి అతని చేతిని అందుకుంది ముసలావిడ.

ఇద్దరూ ముందుకి అడుగులు వేసారు. ఇద్దరి మనసులలోను అగ్నిగోళాలు పేలి పేలి మండుతున్నాయి. సెగలు పొగలు చిమ్ముతున్నాయి. అలాగే సాగి పోయారు, ఆ చీకటిని చీల్చుకుంటూ, ఆ ఇద్దరూ.






# అమృతాంజన్

## తలనొప్పులకు, జలుబులకు, ఒళ్లునొప్పులకు ఇంటింటా ఉండవలసిన దివ్య ఔషధము

తలనొప్పులకు, జలుబులకు, ఒళ్ళు నొప్పులకు ఉపశమనం కలిగించే అమృతాంజన్‌ను బాధగా ఉన్న చోట కొద్దిగా రాసి రుద్దండి. దానిలో చేరి ఉన్న పది శ్రేష్ఠమైన ఔషధాలు నిమిషాల మీద గుణం కలిగిస్తాయని మీరు తెలుసుకొంటారు. అదావేసే పెద్ద సీసాలలోను, చిన్న సీసాలలోను తక్కువ వెలకు ఇమిడికగా చిన్న డబ్బాలలోను లభిస్తుంది.




అమృతాంజన్ 80 సంవత్సరాలకు పైబడిన నమ్మకమైన దివ్య ఔషధము.

అమృతాంజన్ లిమిటెడ్

AM 1912

సీరియల్

# గవర్నెస్ కరుణ

## —గంటి వెంకటరమణ—

రాత్రి ఏడుగంటలకి కారు శబ్దం వినిపించింది. డూప్లే వచ్చినట్లు బూట్ల టకటక శబ్దం వినిపిస్తోంది. కరుణ ఆ పిల్ల పక్కన సోఫాలో కూర్చుని చేతిలో వున్న గీతల్ని చూపిస్తూ 'ఏరావ్ హెడ్, ఏ లక్ష్మణ్ హెడ్,' అంటోంది.

విని విని డాలీ ఆమె మొహంలోకి చూస్తూ 'మై వగ్ లినహీ,' అంది.

కరుణ దెబ్బకి అదిరిపోయింది. డాలీని పిచ్చిదాన్ని చేసి తనేం మాట్లాడింది. తండ్రి రాగానే డాలీ పుస్తకాల పంచి తీసుకుని గొంతు పెద్దది చేసి పుస్తకంలో మొహం దూర్చి 'ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్ స్టార్,' అంటోంది.

తండ్రి తనని గమనిస్తున్నాడో లేదో అని దొంగ చూపులు చూస్తోంది. డూప్లే తెలుగులో 'మీరలా రండి' అన్నాడు పక్క గదిలోకి దారి తీస్తూ. కరుణ అతన్ని అనుసరించింది.

అతను ఆమెకు సీటు చూపించాడు. ఆమె కూర్చుంది.

'ఏమంటారు.'

'వుద్యోగం చేస్తాను.'

'మా డాలీ పిచ్చిదికాదు. చాలా తెలివైనది మూడ్ బాగులేకపోతే యిల్లంతా ఒక కొలిక్కి తీసుకువస్తుంది. ఆ స్థితిని భరించలేక యిప్పటి వరకూ చాలా మంది రిజైన్ చేశారు.'

'నేను రిజైన్ చేయను.'

'యింత కంటే మంచి వుద్యోగంవస్తే'

'ముందు మీకు తెలియ జేస్తాను.'

'దట్స్ గుడ్. ఇంతకీ మీతో వున్న ఆమె మీ నాయనమ్మగారా ?'

'కాదు.' ఒకప్పుడు ఆమె మా యింటి గవర్నెస్ అనుకోవచ్చు. ఐమీన్ నాదృష్టిలో ఆమె అంతే. మా వాళ్ళు మాత్రం సర్వెంట్ మెయిడ్ అన్నారు.

*(గత సంచిక తరువాయి)*

'మీకు ఎవరూ లేరా ?'

'నా గవర్నెస్ నాతోనే వుంటుంది. ఇంకెవరు కావాలి ?'

'మీరు మేజర్ కూతురన్నారు. మీకు రైఫిల్ యూజ్ చేయడం తెలుసా ?'

'అఫ్‌కోర్స్. ఐనో స్విమ్మింగ్, హార్స్ రైడింగ్, హంటింగ్ ఎట్ సెట్రా. అవన్నీ సరదాకి నేర్చుకున్నవి. యిప్పుడీ బొంబాయిలో వాటి వుపయోగం నాకేమీ లేదు.'

'సో. థీక్‌హై. మీరు నిశ్చింతగా వుండి పోవచ్చును.'

కరుణ ఆలోచనలో పడింది.

'మీకు యీ యింట్లో ఏ మాత్రం అవమానం జరగదు,' అని అతను లేచి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

అప్పుడే ప్రారంభం అయింది కరుణకి జీవితం గురించి తెలియడం.

ఆ యింట్లో అరవవంటలు వండేందుకు నాయర్ వున్నాడు. అతను చేసే వంటలు తప్ప మరేమీ ముట్టుకోడు డూప్లే. అతను

---

***జరిగినకథ: 4*** డాక్టర్ భార్గవ, మేనకల ఏకైక పుత్రిక కరుణ. తన తల్లి, మూర్తితో చనువుగా ఉండటాన్ని చూచి సహించలేక పోతుంది. ఊరి నుండి తిరిగి వచ్చిన భార్గవకు, మేనక మూర్తితో లేచిపోయిందని దర్శన్ చెప్తుంది. మేనకా వియోగంతో భార్గవ ఆత్మహత్య చేసుకోగా, అప్పుల వాళ్ళు ఆస్తినంతా కాజేయగా, దర్శన్‌తో మేనత్త 'కాళి' యింటికి వెళ్తుంది కరుణ. బొంబాయిలో తల్లిలేని పిల్ల 'డాలీ'ని సంరక్షించే ఉద్యోగంలో కరుణ చేరుతుంది.

---

ప్రొద్దున్నలేచి మొహం కడుక్కొని నాయర్ అందించిన ఫిల్టర్ కాఫీ త్రాగి కాలకృత్యాలు తీర్చుకుని వాకింగ్ స్టిక్‌తో బయటికి వచ్చేసరికి అప్పుడు తూరుపురేఖలు చీకట్లను చీల్చేందుకు ప్రయత్నం చేస్తుంటాయి. అతను వాకింగ్‌కి వెళ్ళి వచ్చేసరికి ఆరున్నర అవుతుంది. అప్పుడు చాయ్ తాగుతాడు. ఆ తరువాత అరగంట పేపర్ చూసి నాయర్ అందించిన యిడ్లీ సాంబారు తీసుకుని బయటికి వెళ్ళిపోతాడు. ఆ వెళ్ళడం వెళ్ళడం మధ్యాహ్నం పన్నెండు వొంటి గంటలకి గానీ తిరిగి రాడు అతను రాగానే సాంబారు, అవియల్ మొదలైన వంటలతో భోజనం చేసి కొంచెం సేపు విశ్రాంతి తీసుకుంటాడు.

తిరిగి రెండు గంటలకి వెళ్ళి రాత్రి వస్తాడు. ఇష్టమైతే భోజనం చేస్తాడు. లేదా తలుపులు బిగించుకుంటాడు. రోజులు గడుస్తుంటే కరుణ అతని చర్యలని దీక్షగా గమనించసాగింది. ఒక్కరోజు కూడా అతను కూతుర్ని పిలవడం, ముద్దుచేయడం చూడలేదు. గణేశ్ ఆ పిల్లకి పదికావాలిసినా తీసుకువస్తాడు. స్కూలుకి తీసుకువెళ్ళడం అతని వొంతు. ఆ పిల్ల బాగోగులు చూసేందుకు గణేశ్ వున్నాడన్నమాట.

డాలీకి తలదువ్వుతూంటే బాగా దువ్వలేదని పేచీకి దిగింది. గణేశ్ చాలారకాలుగా బతిమాలాడు. ఆ పిల్ల ఒక పట్టాన లొంగలేదు. బుజ్జగించి ఎత్తుకుంది కరుణ. డాలీ నవ్వేసి ఆమె మెడ చుట్టూ చేతులు వేసింది.

గణేశ్ స్కూల్లో వదిలి పెట్టివచ్చాక అడిగింది కరుణ: 'గణేశ్ డాలీని ఎవరూ యెత్తుకోరా ?'

'నేను ఎత్తుకుంటాను.'

'నువ్వు గాక మీ సాబ్ ఎత్తుకోరా'

'లేదు. దగ్గరకే రానీయరు.'

'ఎందుకని ?'

'డాలీ తల్లిని మా సాబ్ చాలా బాగా చూశారు. ఆమెని ప్రేమించి పెళ్ళి చేసుకున్నారు. డాలీని సిజేరియన్ చేసి తీశారు. అప్పుడే ఆమె పోయింది.' గణేశ్‌కి పాత సంఘటనలు జ్ఞాపకం వచ్చాయి: 'ఆమె పోవడానికి డాలీ కారణం అని ఆ పిల్లని దగ్గరకు రానీయరు'

నివ్వెర పోయింది కరుణ: 'వింత;

అన్యాయం. డాలీ పుట్టుకకీ, ఆమెచావుకీ సంబంధం లేదని అతనికి తెలీగాదా!'

'ఆయన అంత ఆలోచించరు. ఒకవేళ ఆలోచించగల్గినా మందు నిషాలో ఆయనకి ఇవేమీ తెలియవు.'

'పాపం. అందుకే ప్రేమకి మొహంవాచి డాలీ పెంకిగా తయారైంది.'

గణేశ్ 'అవున'న్నట్టు తలూపాడు.

డాలీకి కరుణ రాక చాలా కొత్తగా అపురూపంగా వుంది దర్శన్ కూడా ఆమెని



ప్రేమగా చూస్తోంది. ఈ రెండు ప్రేమల ధాటికి ఒక్కోసారి ఆ చిన్న మనసు తట్టుకోలేక పోతోంది. కరుణ కనిపించక పోతే 'మిస్' అంటూ గట్టిగా ఏడుస్తోంది. డూప్లే ప్లాస్టిక్ షీట్స్ దగ్గర్నుంచి రికార్డ్స్, స్పేర్స్ వరకూ అన్ని రకాల బిజినెస్ చేస్తాడు. కరుణ చాలా రోజుల తర్వాత 'డూప్లేకి చెప్పమని', 'గణేశ్'తో చెప్పి అతను 'సరే' అని కబురు చేశాక పిక్చర్‌కి వెళ్ళింది.

బొంబాయి వాతావరణానికి అలవాటు పడడం ఏమంత సమస్య కాలేదు కరుణకీ దర్శన్‌కీ గణేశ్ ఆమెకు అన్ని రూట్స్ వివరంగా చెబుతాడు.

పిక్చర్ నుంచి రాగానే డాలీ ఇల్లంతా చిందర వందర చేస్తోంది కరుణ ఆమె దగ్గరకి వచ్చి 'ఏం కావాలి?' అని రక రకాలుగా బతిమలాడితే అప్పటికి ఊరుకుంది డాలీ

డాలీ ఇప్పుడు ఇసుకలో ఆడడం, సిరాహోలక పోయడం, మట్టి చేతులతో గణేశ్ నెత్తిని మర్దనా చేయడం వంటి పిచ్చి పనులు చేయడం మానుకుంది. స్కూలుకి రెగ్యులర్‌గా వెడుతోంది. ఆమెకూ తండ్రికీ మధ్య అగాధం వుందని కరుణ చాలా తేలిగ్గా గుర్తుపట్టింది. కొన్ని కొన్ని విషయాల్లో ఆడవాళ్ళ కన్నా మగవాళ్ళే తెలివిగా వుండరని, కరుణ గ్రహించింది. తల్లిదండ్రుల పెంపకంలో లోటు పొట్లు వుంటే అవి పిల్లల మీద అద్దంలో ప్రతిబింబంలా కనిపిస్తాయి. క్రమశిక్షణ పేరుతో కొంత మంది పిల్లల్ని దగ్గరకే చేరనీయరు. అటు సంఘ విద్రోహులుగా తయారయ్యే ప్రమాదం కూడా వుంది. ఈ విషయాలన్నీ డూప్లేకి చెప్పాలని వుంటుంది కరుణకి. కానీ అతను...గంభీరంగా, తన పనికి అంకితమైపోయి రాత్రి నిషాలో మునగడం వరకే ఆ యింట్లో ప్రతి మనిషికీ తెలుసు.

మొదటి రోజున మాట్లాడిన డూప్లే తిరిగి ఎప్పుడూ ఆమెతో మాటాడలేదు. అతను యాంత్రికంగా బతుకుతున్నాడా అనిపిస్తుంది ఒక్కొక్క రోజు బాల్కనీలో నిల్చుని గంటల తరబడి సూర్యాస్తమయం అయ్యే వరకూ ఆలోచిస్తూనే వుంటాడు. ఒక మనిషి ప్రేమించడం, బాధపడడం విన్నది కానీ భార్య కోసం ఇంత మారడు

నిజే బాధ ఒక్కోసారి చిత్రంగా కూడా అనిపిస్తుంది. డగ్లాస్ భార్య ఫోటో చూడాలని ప్రయత్నం చేసింది. కానీ ఆ ఫోటో ఎక్కడా లేదు. ఆమె పోయిన తరువాత ఫోటోల్ని కూడా చింపేశాడని గణేశ్ చెప్పాడు. ఆమె గుర్తుగా కనిపించే ఏ వస్తువూ ఆ యింట్లో కనిపించదు.

డగ్లాస్ త్రాగుతూంటే కరుణ అవతలి గదిలోంచి ఆ శబ్దం వింటూ కూర్చునేది. అతని దగ్గరకి వెళ్ళి 'సర్ తాగద్దండి,' అనాలనుకునేది. కాని అతని విగ్రహం కళ్ళ ముందు అస్పష్టంగా కనిపించగానే ఆమడ దూరంలో ఆగిపోయేది.

డాలీ ఆ వేళ ప్రొద్దున్నే పేచీకి దిగింది. డగ్లాస్ వాకింగ్‌కి వెళ్ళాడు. 'ఫలానాది,' కావాలని ఏడవదు డాలి. చేతిలో ఏది వుంటే అది విసిరేస్తుంది. జుట్టు పీక్కుంటుంది. నీళ్ళు పారబోస్తుంది. ఇది, అది అని లేదు. రోజువారీ పనులు అనేవి అన్నీ చేసి యింటిల్లి పాదినీ హైరాన పెట్టేస్తుంది.

యజమాని కూతురన్న భయంతో, ఉద్యోగం పోతుందేమో అన్న బెంగతో గణేశ్ ఒక్కడే డాలి ఆగడం యిన్నాళ్ళూ భరించాడు. ఇప్పుడు అతనికి తోడుగా కరుణ కూడా భరిస్తోంది. డాలి ఎంత బిడ్డ అయితే ఆ బాధల్ని గురించి తెలిక నాలుగు పెట్టేది. కానీ...ఒకప్పుడు విదేశ్త్రాధి

# గవర్నెస్ కరుణ

సత్యంగా ఏలిన మహారాజు పొరుగురాజుకి సామంతుడిగా అయిపోవడం వంటిదే యిప్పుడు కరుణ వున్న పరిస్థితి.

డాలీని ఎత్తుకుంది. హృదయానికి హత్తుకుంది; కరుణ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఈ కష్టం ఆమె 'నేను భరించలేను భగవంతుడా' అనుకునేట్టు చేస్తోంది. చావుకి దగ్గరగా తెచ్చే యీ భావం ఆమెను నిస్సత్తువకి గురి చేస్తోంది.

డాలీ ఏడ్చి ఏడ్చి అల్లరితో అలసిపోయి కరుణ భుజంమీద వాలిపోయింది. నిద్రలో ఏగుపులు కనిపిస్తున్నాయి. తీసుకువెళ్ళి తన మంచం మీద పడుకో బెట్టుకుంది.

ఏడ్చిన కన్నీళ్ళు బుగ్గల మీద పడి మరకలుగా ఏర్పడ్డాయి. కళ్ళు ఎర్రగా వాచి పోయాయి.

'ఈ పిల్లకి ఏం కావాలి? సమస్తమూ వున్న యీ యింట్లో యీ చిట్టితల్లి ఎందుకు ఏడుస్తోంది? ఈ పిల్ల ఇంత మంది ఏడుపుకి కారణంగా అయిపోతూంటే డగ్లాస్‌కి ఏమీ పట్టడం లేదా? యింగ్లీషు దేశాల్లో వుండే గవర్నెస్ మాదిరే తనని ట్రీట్ చేస్తున్నాడు. అతనికి మనిషిని ప్రేమించడం తెలుసు కాని ఆ పరిధిలోకి బలవంతంగా ఎవరూ వెళ్ళలేరు. డాలిని ఆ పరిధిలోకి తోసేయాలి. ఎలా? కరుణ ఆలోచిస్తోంది. సాయంత్రం ఎవరూ భోజనం చేయలేదు. డాలీ స్కూలుకి వెళ్ళలేదు. వెళ్ళనందుకు డగ్లాస్ ఏమైనా అంటాడేమో అనిభయపడింది. కానీ అతను ఆ రోజు యింటికే రాలేదు. పసిపిల్ల మంచినీళ్ళు ముట్టలేదని ఎవరూకూడా భోజనానికి కూర్చోలేదు. చూస్తూండగానే ప్రొద్దువాలి పోయింది. చీకట్లు చేరుకున్నాయి. డగ్లాస్ అర్ధరాత్రి వచ్చాడు. అతన్ని గణేశ్ తీసుకు వచ్చాడు. గేటు వరకూ పాపం బాగా త్రాగించిన మిత్ర బృందం విడిచిపెట్టారు. కారు హారన్ విని తనకే తెలివి వచ్చింది. గణేశ్ చేతుల్ని తోసేసి 'నో...నేన్రాను రానంటే,' అని అరుస్తున్నాడు. ధబ్బుమని పడిన శబ్దం విని కరుణ యింక ఆ తలుపుల వెనుక వుండలేక పోయింది. తలుపులు తెరుచుకుని బయటికి వచ్చింది. అతను మెట్లమీద చేతులు మెట్టుకి ఆన్చి పొడవుగా పడిపోయాడు. కరుణకి ఆ స్థితిలో అతన్ని చూస్తే జాలివేసింది. రెండు క్షణాలు ఆలోచించింది.

మరుక్షణం ఆమెకు కర్తవ్యం తెలిసింది. అతని దగ్గరకి వెళ్ళి రెండు చేతుల్నీ లేవదీసింది. డగ్లాస్ కళ్ళు తెరవాలని ప్రయత్నం చేశాడు. అతనికి మగతలోనే మాట్లాడాలని వుంది. కానీ మాట్లాడలేక పోతున్నాడు. తల గిర్రున తిరిగి పోతోంది. రోజూకన్న దోమ ఎక్కువైంది. ఆ స్పర్శ ... అతను ఆ చేతుల్ని విసిరివేయాలని కుంటున్నాడు. కానీ శక్తి లేకుండా పోతోంది. నెమ్మదిగా వాలిపోతున్నాడు. గణేశ్ లేవదీశాడు. మెడ చుట్టూ అతని చేతులు వేసుకుని ఇద్దరూ అతన్ని జాగ్రత్తగా మెట్లు ఎక్కించారు.

ఫాన్ వేసింది కరుణ. ఫాన్‌గాలికి అతను కదలడం మానేశాడు. హాయిగా నిద్రలోకి జారిపోయాడు. కరుణకి ఎప్పుడూ లేనిది యివాళ చాలా కష్టంగా వుంది. యిందుకు నుండికి యిన్నిరకాలుగా ఎన్నాళ్ళు 'సేవ చేయాలి? ఈ జీవితానికి విముక్తి ఎప్పుడు అనుకుంటోంది. తాగేవాళ్ళన్నా, తాగుడన్నా భయం కరుణకి. తను ఈ విధంగా అయి నందుకు కారణం తన తల్లి తండ్రీయే అని ఆమెకు బాగా తెలుసు. ఆమె అతన్ని గది లోకి చేర్చాక వెళ్ళి డాలి పక్కన పడుకుంది.



# హార్లిక్స్




## ఆరోజుకు ఆరోజు రోగనివారణ శక్తిని పెంచి ఆరోగ్యాన్ని కాపాడే పౌష్టికాహారం.

హార్లిక్స్ నిత్యం సేవించినట్టయితే, మీ కుటుంబానికి రోగాలు రాకుండా తట్టుకునే శక్తి పెరుగుతుంది. వారికి సంపూర్ణమయిన ఆరోగ్యం చేకూరుతుంది. ఆరోగ్యం మహాభాగ్యం.

హార్లిక్స్, ప్రపంచం అంతటా డాక్టర్లు సిఫార్సు చేసేది ఇది ఒక్కటే, మీకు అత్యధికంగా పుష్టి ఇచ్చేది ఇది ఒక్కటే ఎందుచేతనంటే ఇందులోను సంపన్నమయిన స్వచ్ఛమయిన పదార్థాలు; అపూర్వమయిన హార్లిక్స్ పద్ధతి ప్రకారం సమ్మిళితమితాయి. దీనివల్ల వీటి సహజ సద్గుణాలు నష్టంకావు. అవి సులువుగా జీర్ణం అవుతాయి.

అందువల్లనే సుచిత్ర హార్లిక్స్‌ని తన కుటుంబ జీవితంలో భాగంగా చేసుకుంది.

సుచిత్ర మోస్తరుగానే మీరుకూడా మీకుటుంబానికి ప్రతిరోజు హార్లిక్స్ ఇవ్వండి వారు ఆరోగ్యంగా, బలంగా పెరగడం మీకు కనబడుతుంది.

"హార్లిక్స్ ప్రధానమయిన పుష్టి సాధనం. మీకుటుంబంలోనివారికి వ్యాధులు రాకుండా తట్టుకునే శక్తి పెరిగేందుకూ వారు ఆరోజుకారోజు ఆరోగ్యంగా, చురుగ్గా ఉండేందుకూ నేను హార్లిక్స్‌ను సిఫారుసు చేస్తున్నాను"



**హార్లిక్స్ మంచి పుష్టికరమైనది.**

హార్లిక్స్ రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్.

## అప్పు లభించును

రు. 20,000 లు అంతకు మించి, సరళమైన వడ్డీ మరియు సులభ వాయిదాలపై భవనములు, భూములు, షాపులు, పారిశ్రామిక యూనిట్లు, మిల్లులు, థియేటర్లు, ప్రయివేటు లిమిటెడ్, పబ్లిక్ లిమిటెడ్ కంపెనీలు, ఓనర్‌షిప్ బ్లాకుల హామీలపై లభించును. వ్రాయండి లేదా నేరుగా సంప్రదించండి.

**SUPREME CORPORATION (Bankers)**

**F. 15, 'EVEREST' 7th Floor, Near Famous Cine Laboratory, Tardeo Road, BOMBAY-400034, Phone : 385126.**

SILVER PRINCE STAINLESS

# మరొక అడుగు ముందుకు వేసింది

## సిల్వర్ ప్రిన్స్

కొత్త, సాటిలేని అంతర్జాతీయ నిర్మాణ తీరులవలనే మరి ఇది శ్రేష్ఠమైన బ్లేడ్‌గా రూపొందడానికి కారణం.
ఎక్కువలో ఎక్కువసార్లు మృదువుగా, నున్నగా గెడ్డం గీసుకునేందుకు.
ప్రతిసారీ విజయాన్ని సాధించేందుకు.




## సిల్వర్ ప్రిన్స్

కొత్త సాంకేతిక నైపుణ్యం—మేలైన నాణ్యత.

# గవర్నెస్ కరుణ

మంచానికి కొంచెం దూరంలో ఐరిస్ మరో మంచం మీద అదమరిచి నిద్రపోతోంది. చీకూచింతా లేనట్లు ఆమె మొహం ప్రశాంతంగా వుంది.

కరుణకి నిద్ర రాలేదు. నిద్రపోవాలని కూడా అనిపించడంలేదు—ఒక్కోసమయంలో తమకు తాము విధించుకున్నే శిక్ష చాలా చిత్రంగా వుంటుంది. శారీరకంగా కానీ, మానసికంగా కానీ చావు కావాలి అని మనిషి కోరుకున్నాడు అంటే ఈ బ్రతుకు భయానికి పారిపోయి చేసిన పని అది. అతనావిధంగా వేసుకున్న శిక్ష అది. యిప్పుడు కరుణకి కూడా తాగాలని వుంది. తాగితే అంత ఆనందం పొందే ఆ మనుష్యులకీ దేనికీ సుఖం. తనకి లోపించిన సుఖాన్ని తనూ కోరుకుంటుంది. తాగాలి ... లేదా మార్ఫియా వంటి యింజక్షన్ తీసుకోవాలి. అది సాధ్యం కాకపోతే స్లీపింగ్ పిల్స్ వేసుకోవాలి.

కరుణ ఆలోచిస్తోంది. ఇందులో ఏ ఒక్కటీ ఆమెకి అందుబాటులో లేవు.

'మిస్'

వులిక్కిపడింది కరుణ. డాలీ లేచి కరుణ ఒళ్లో తల పెట్టుకుని పడుకుంది. డాలీ స్పర్శ ఆమెను చాలా త్వరగా ఈ లోకంలోకి తెచ్చి పడేసింది.

'మిస్'

డాలీ పిలుపుకి 'ఏం కావాలి తల్పే' అంది.

డాలీ క్షణం ఆలోచించి 'మిస్ నీతో నన్నూ పిక్చర్‌కి తీసుకువెళ్లు. నన్ను వదిలి వెళ్లకు మిస్' అంది.

డాలీని హఠాత్తుగా కౌగిలించుకుంది కరుణ. ఆమె కళ్లల్లో నీళ్లు చాలా ఉధృతంగా పైకి వచ్చాయి. ప్రేమ కోసం అల్లాడిపోతున్న ఈ పిల్లని వదిలి వెళ్లడం అంత సులభం కాదేమో అనిపిస్తోంది.

ఒక్కో బంధం కావాలని ఏర్పరచుకోకపోయినా కాలికి చుట్టుకుంటుంది. డాలీ పెనవేసుకు పోతుంది కరుణ మనసులో. ఇప్పుడు వున్నపాటున మరో ఉద్యోగం కోసం ప్రయత్నంచేసినా అది వచ్చేదెప్పుడు? ఈ జీవితం యిలా అంతం కావలసిందేనా?

కరుణ పక్కనే ఆమె మెడ చుట్టూ

(36 వ పేజీ చూడండి)




నవరక్తిని, నవశక్తిని కలిగించే

# నెస్కాఫే®



ప్రపంచంలోకల్లా
అత్యధికంగా
అమ్ముడుపోయే
ఇన్‌స్టెంట్ కాఫీ

నూటికి నూరుపాళ్లు స్వచ్ఛ మైన కాఫీతో
తయారయ్యే ఒకే ఒక ఇన్‌స్టెంట్ కాఫీ

NS/CAS-1/79 TEL

## పూర్వజన్మ గురించి పరిశోధనలు

# కొర్నిలియా మెట్జ్ ఆరువేల సంవత్సరాల జీవిత కథ

కొర్నిలియా మెట్జ్ వయస్సు 32. మ్యూనిచ్‌లో ఒక సంస్థలో కార్యదర్శి (సెక్రటరీ) గా పని చేస్తున్నది. ఒక పాత భవనంలో మూడు గదులలో ఆమె నివాసం. ఆమె కుమారుడు థామస్. వయస్సు 8 సంవత్సరాలు. వారికి రెండు పిల్లులూ, వగయిరా వున్నాయి.

ఆరువేల సంవత్సరాల క్రితం రాతియుగంలో, గుహలలో ఆమె నివసించేది. తన తండ్రి పట్ల వాత్సల్యం చూపించలేదనే కారణాన సొంత శిశువును ఆమె చంపేసింది. ఆమెనేమో ఆమె కుటుంబంలోనివారు రాళ్ళతో కొట్టి చంపారు.

18వ శతాబ్దంలో నైఋతి జర్మనీలోని బ్లాక్ ఫారెస్ట్ ప్రాంతంలో క్లాడియా రోడర్‌గా ఆమె తిరిగి జన్మించింది. ఉడ్ టెన్‌బర్గ్ ప్రభువును చంపేందుకు ఆమె భర్త కుట్రచేయగా 24 సంవత్సరాల వయస్సప్పుడు ఆమెను ఒక టవర్‌లో బంధించారు. ఎలుకలు ఆమెను తినివేశాయి.

పంధొమ్మిదవ శతాబ్దంలో బారన్ రెడ్‌విట్జ్‌కి అక్రమ సంతానంగా జన్మించింది. ఆ జన్మలో ఆమె పేరు సిలెసియా. పన్నెండు సంవత్సరాల వయస్సప్పుడు మరణించింది.

ఇక నాలుగవ జన్మలో గొప్పిన్ గెన్‌లో 1946లో ఆమె తిరిగి జన్మించి, ఇటీవలనే టెలివిజన్‌లో పని ప్రారంభించింది. మ్యూనిచ్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పారానార్మల్ సైకాలజీ అధిపతి కొర్‌వాల్డ్ డెత్లెఫ్‌సెన్‌ను టెలివిజన్ కేంద్రంలో ఆమెను కలుసుకొని, ఆమె వళ్ళు ఆమెకు తెలియకుండానే మనస్సు పని చేసే స్థితిని (హిప్నటైజ్) చేశాడు. ఆ స్థితిలో లక్షలాది టెలివిజన్ శ్రోతలకూ, ప్రేక్షకులకూ ఆమె తన పూర్వజన్మల కథ చెప్పింది.

అప్పటినుండీ అభిమానులవద్ద నుంచి ఆమెకు రకరకాల జాబులు రావడం ప్రారంభించాయి. కొంతమంది ఆమెకు టెలిఫోన్ చేశారు. కొంత మంది వీధులలో ఆమెను నిలవేసి మాట్లాడుతున్నారు ఇదంతా ఆశ్చర్యం కలిగించింది ఆమెకు.

సాహిత్య ప్రచురణ సంస్థల ఏజెంట్లయిన ఫ్రెంసిజ్ సంస్థతో కొర్నిలియా మెట్జ్ ఇప్పుడొక కాంట్రాక్టు తీసుకొన్నది. ఆమె జీవిత చరిత్రను ధారావాహికంగానూ, ఆ తర్వాత పుస్తకంగానూ వారు ప్రచురిస్తారు.

కొర్‌వాల్డ్ డెత్లెఫ్‌సెన్‌ను ఒక ఫిలిప్‌లో కొర్నిలియా మెట్జ్ తొలుత కలుసుకొన్నది. చాలామందిని ప్రయోగాలకోసం ఆయన అప్పుడు హిప్నటైజ్ చేస్తున్నాడు తనమీద కూడా కొన్ని ప్రయోగాలు చేయవలసినదిగా ఆయనను ఆమె కోరింది. ఎలాంటి ప్రయోగాలు ఆయన చేయబోతున్నాడో, తెలియకుండానే ఆమె అలా కోరింది.

### ప్రయోగాల ఫలితాలు

శిక్షణ పొందిన మనస్తత్వ శాస్త్రవేత్త డెత్లెఫ్‌సెన్. ఆమెతో కొన్ని ప్రయోగాలు జరిపిన తర్వాత తన పూర్వజన్మలలో జరిగిన కొన్ని సంఘటనలను ఆమె చెప్పినట్టు ఆమెకు ఆయన చెప్పారు. ఒకరి ఆత్మ ఇంకొకరి శరీరంలో ప్రవేశించుతుందనే మత విశ్వాసం ఆమెకు లేదట! కాని, ఇంతకుముందు తను చదివిన సంఘటనలను ఆ ప్రయోగాలలో తాను చెప్పినదనే వాదనలను మాత్రం ఆమె ఖండించుతున్నది. తాను ఇప్పుడు, గత జన్మలలోకంటే జాగ్రత్తగా బ్రతుకుతున్నాననీ, ఇంతకుముందు చేసివున్న తప్పులు చేయడంలేదని



ఆమె చెబుతుంది. పూర్వజన్మలలోని తన అనుభవాలకూ, ఈ జన్మలోని అనుభవాలకు పోలికలు ఆమె చెబుతుంది.

ప్రస్తుత జన్మలో తాను ఎదుర్కొంటున్న సమస్యలను పూర్వజన్మలలోకూడా ఎదుర్కొన్నదట. హిప్నసిస్ ప్రయోగాలు జరుగక పూర్వం ఎవరో తనను ఎక్కడో ఒంటరిగా బంధించారనే భయం, అనుభూతి ఆమెకు కలుగుతూండేవి. ఎలుకల టవర్‌లో 18వ శతాబ్దంలోని జన్మలో ఆమె పడిన యాతనల పర్యవసానం ఈ భయం. పూర్వజన్మలలో తన అనుభవాల వివరాలు తెలిసిన తర్వాత ఇప్పుడు ఆమెకు ఆ భయం పోయిందట. పూర్వజన్మలలోని అనుభవాలను తెలుసుకొన్న ఫలితంగా ఈ జన్మలో చాలా సమస్యలను పరిష్కరించుకొనగలిగినట్టు ఆమె చెబుతుంది. తన కొడుకుతో కాలక్షేపం చేయడమంటే ఆమెకు చాలా యిష్టమట.

అదేవిధంగా—ఈరోజులలో నరాల వ్యాధులతో బాధపడేవారి సమస్యలు పూర్వజన్మలలో వారి అనుభవాల పర్యవసానాలని డెత్లెఫ్‌సెన్ నమ్మకం అలాంటి రోగులే మనోవ్యాధుల చికిత్సా నిపుణుల వద్దకు వెడుతూంటారని ఆయన అభిప్రాయం.

మనం ఎక్కడనుంచి వచ్చాము? మరణం తర్వాత ఎక్కడ వెడతాము? అని ప్రపంచంలోని గొప్ప మతాలు ముఖ్యంగా హైందవం, బౌద్ధం ప్రశ్నిస్తాయి. మామూలు మనస్తత్వశాస్త్రం, వైద్య శాస్త్రాలలో ఒక వ్యక్తిని వ్యక్తిగానే స్వీకరిస్తారు గాని యిలాంటి ప్రశ్నలకు అవకాశం యివ్వరు. ఈ అంశం గురించిన వివిధ ప్రశ్నలకూ ఖచ్చితమయిన సమాధానాలను సైన్సు కనిపెట్టవలసి వున్నది.

### శరీరం, మనస్సు, ఆత్మ

మనోవ్యాధుల చికిత్సా నిపుణుడుగా తన కృషితో పునర్జన్మ సిద్ధాంతాన్ని బలపరచే అంశాలను కనిపెట్టినట్టు డెత్లెఫ్‌సెన్ చెప్పాడు. తనవద్దకు వచ్చే రోగులమీద గాక వలంటీర్లుగా వచ్చేవారిమీద ఒక కొత్త పద్ధతిలో ప్రయోగాలు ఆయన చేశాడు. పూర్వజన్మలలోని అనుభవాలను వారిచేత ఆయన చెప్పించాడు మ్యూనిచ్‌లోని బెర్టెల్స్‌మన్ సంస్థ ప్రచురించిన తన గ్రంథం "ది ఎక్స్‌పీరియన్స్ ఆఫ్ రీ బర్త్"లో ఈ కథను ఆయన వివరించాడు. మనిషిని— శరీరం, మనస్సు, ఆత్మ అనే మూడు భాగాలుగా విభజించే ఒక సిద్ధాంతాన్ని ఆయన రూపొందించాడు. ఆయన లెక్క ప్రకారం శరీరం కేవలం పదార్థం— మరణానంతరం పూర్తిగా నశించుతుంది— మనస్సు అనేదే జీవితం— "ఆత్మ" అనేదే మనిషికి వ్యక్తిత్వం యిస్తుంది.

ప్రతి అంశాన్ని అదుపులో పెట్టి నడిపించేదేదో వ్యక్తిలో వుండాలనీ, అది పదార్థంమాత్రం కాజాలదనీ ఆయన అభిప్రాయం. మరణానంతరం శరీరాన్ని వదలివెళ్ళేది ఆత్మ.

రెయినర్ ఫ్యూక్స్ అనే మ్యూనిచ్ ప్రొఫెసర్, డెత్లెఫ్‌సెన్ ప్రయోగాలను ఇంకా కొంత పొడిగించి కొనసాగించాడు. ఆయన మరొకరకంగా అభిప్రాయపడుతున్నాడు. డెత్లెఫ్‌సెన్ పూర్వజన్మలలోని అనుభవాలని వర్ణించుకున్నవి కొన్ని సంవత్సరాలుగా ఆయా వ్యక్తులు కంటున్న కలలయినా కావచ్చు లేదా ఊహలయినా కావచ్చు. అంతకంటే మరేమీ కాదని ఆయన అభిప్రాయం.

ఈ పునర్జన్మ సిద్ధాంతం చర్చికి కూడా ఒకరకంగా సవాలు దేవుడు దయ చూపించి, ముక్తి నిస్తాడనే సిద్ధాంతంతో పునర్జన్మ సిద్ధాంతం పొసగదు. జెర్‌హార్డ్ విడ్లర్ అనే జర్నలిస్ట్ 'ది బారన్ ఆఫ్టర్ డెత్' అనే తన గ్రంథంలో ఈ విషయం విశదీకరించాడు.

క్రయిస్తవం చెప్పే పునరుజ్జీవనం, పునర్జన్మ ఒకటికాదు. పునరుజ్జీవనం అంటే "ఆధ్యాత్మిక పునర్జన్మ." అంతేగాని ఒకరి ఆత్మ మరొక శరీరంలో ప్రవేశించడం కాదని ఆయన ఆ గ్రంథంలో వాదించాడు.

("మ్యుంక్‌నర్ మెర్క్యూర్" వార్త ఆధారంగా వి.ఎస్.వి


(గత సంచిక తరువాయి)
నలమహారాజా! మా పుష్కరుల వారు మీతో జూదము ఆడగోరి విచ్చేసినారు
విప్రోత్తమా! జూదానికి ఆహ్వానిస్తే ఆడను అనడము దోషము కదా దయచేయండి ఆడుదాము


హా! నేను మంత్రి ఎంత చెప్పినా ప్రయోజనము లేదు. క్రా నున్నది కనక మానడు
నలుడు కలి మాహాత్మ్యముచే వివిధ వస్తు వాహన నివహంబులు ఒక్కొక్కటే ఓడి ఓడుచుండెను అదిగమనించి దమయంతి.
2-81
295


వార్ష్ణేయా! యువరాజును యువరాణిని క్షేమంగా విదర్భలో మా తండ్రిగారి ఇంటికి చేర్చి వెంటనే రమ్ము
దమయంతి రానున్న విషమ పరిస్థితి గ్రహించి నలుని అనుమతితో రథసారథిని రావించి, ఇంద్రసేనుడను తన కుమారుని, ఇంద్రసేనయను కుమార్తెను తండ్రియగు విదర్భేశ్వరుని యొద్దకంపెను


ఏమి! విధి వైపరీత్యము! పుష్కరునితో జూదమాడి రాజ్యసర్వస్వము కోల్పోవుట ఏమిటి! హా! పోనీ నా ప్రజల పూర్వానురాగము ఏమైనది?
పురము వెడలి వచ్చి మూడహోరాత్రములైనవి మా ముఖము చూచినవారు పట్టెడన్నము పెట్టినవారు లేరు దమయంతికి నాకు ఏదో ఆహారము చూడాలి
2-82
296


ఈ పక్షులు చేజిక్కిన మా ఆకలి బాధ తీరగలదు
నలుడు కొన్ని పక్షులను జూచి వాటితో ఆకలి తీర్చుకొనవలెనన్న తలంచి కట్టు బట్టను విప్పి పక్షులపై గప్పెను..


!?
నలమహారాజా! మేము జూదపు పాచికలము. నీ యొద్ద మిగిలిన కట్టు బట్ట కాజేయడానికే ఇలా పక్షులమై వచ్చాము హహహ
2-83
297


దేవీ! నీ పమిట కొంగు నాకు పరిధానము యినది. హా!... ఇంక ఈ కాఱడవిలో నాతో నిడుములు పడలేవు..., పుట్టినింటికి వెళ్ళి నీవైనా సుఖపడుము
ఆ రాజ్యము మీదే కదా మీరు రండి వెడదాము
వద్దు దేవీ వద్దు... ఒకప్పుడు అధిక ఐశ్వర్యవంతుడనై మసలి, మామగారి యింటికి ఈ స్థితిలో రాలేను


అట్లయిన నేను మీ అర్ధాంగిని. మీ అనుజీవి కను అనువ్రతను. ఈ కష్టకాలములో మిమ్ము వీడి ఒంటరిగ పోలేను


2-84
298
దేవీ! చెలికత్తెల పరిచర్యలందు పుష్పతల్పము పై పవళించవలసిన నీవు ఈ కటిక నేలపై పరుండగా చూడలేను.... హా! నేను కనపడకపోతే.. ఈమె తన తండ్రి యింటికి తప్పక వెళ్ళునని ఆశగానుంది... దైవేచ్ఛ ఎట్లున్నదో...

[ఇంకా వుంది]




**( గత సంచిక తరువాయి )**

బాబు కిప్పుడిప్పుడే మాటలు బాగా వస్తున్నాయి. తన కిష్టం ఉన్నవాళ్ళని ''యూ ఆర్ బూఫుల్ (బ్యూటిఫుల్)'' అనడం నేర్చుకొన్నాడు. కోపం వచ్చినప్పుడు అందర్నీ ''యూ ఆర్ నాట్ బూఫుల్'' అంటాడు.

ఆ రోజు షీల వళ్లో కూర్చుని ''ఆంటీ యూ ఆర్ బూఫుల్'' అన్నాడు

శంకరరావు కొడుక్కి నేర్పి అనిపించాడు అనుకొంది షీల.

''ఈ మాట అన్నవాళ్లలో నువ్వు కూడా చేరావు!'' అంది షీల శంకరరావుకేసి వోరగా చూస్తూ.

పార్వతికి వళ్లు మండిపోయింది. ఈ పిలకు తను అందమైనదని కొందరంటారన్న విషయం అందరి దృష్టికి తెచ్చి అంతవరకు అననివాళ్లచేత అనిపించుకొంటుంది.

''మా బాబు అందర్నీ అల్లాగే అంటాడు. వాడి మాటలకి ఎక్కువ వాల్యూ ఇవ్వకు. వాళ్ల కొత్త బేబీసిట్టర్ భూతాక్కి బొమ్మలా వుంటుందా, తనని అల్లాగే అంటాడు'' అంది పార్వతి

''ని ఉద్దేశం ఏమిటి పారూ ? నేనందంగా లేననా ?'' అని షీల సూటిగా ప్రశ్నించింది

''నువ్వు అందంగాలేవని పార్వతి మాత్రం ఎల్లా అంటుంది బాబు గురించి చెప్పిందంతేగాని'' అన్నాడు శంకరరావు.

''అన్నట్టు పారూ! ఆర్నెల్ల క్రితం నా బ్లాక్ స్వెట్టర్ చూసి చాలా బావుందని నువ్వు కూడా కొనుక్కోవాలని అనుకొన్నావుకదా! అదిప్పుడు మా స్కూలు దగ్గర వున్న వూల్ వర్త్స్ షాపులో వుంది రేపు లంచ్ అవర్‌లో శంకు వస్తే చూపిస్తాను'' అంది షీల

శంకరరావు తనతో ఏకాంతంగా మాట్లాడటానికి అవకాశంకావాలని అన్నప్పటినుంచి షీల తన్ను కృష్ణ, పార్వతి తప్పుపట్టకుండా వుండే మార్గం ఆలోచించి ఈ పథకంతో వచ్చింది కాని శంకరరావుకి మాటలు మరోలా అర్థమయ్యాయి. ''ఈవిడగారికి కార్లో ఎక్కడకో వెళ్ళాల్సిన పనుందన్నమాట నా పనికి తను సాయం వస్తున్నట్టు నటించి తన పని చేయించుకొంటుంది కాబోలు టాక్సీ ఫేర్ సేవ్ చేసే ప్రయత్నం ఇది. లేకపోతే నన్ను ఏకాంతంగా కలుసుకోడాని కిష్టపడని షీల ఇవాళ ఇల్లా మాట్లాడ్తోందంటే అర్థమేమిటి?''

అనుకొన్నాడు శంకరరావు అనుకొని, ''షాపు చెప్పావుకదా! తరువాత నేను పారూ వెళ్లి శనివారం కొనుక్కుంటాం'' అన్నాడు.

''అప్పుడనుకొన్నానుకాని ఈమధ్య అంతకంటే మంచి స్వెట్టర్స్ కొనుక్కున్నాను. అది కొనుక్కోను'' అంది పార్వతి, ''నువ్వు కొనుక్కున్నలాంటివే కొనుక్కోవాలని ఎవరూ యిక్కడ అనుకోడంలేదు. నీ టేస్టు అంత గొప్పదేంకాదు'' అన్న ధోరణిలో.

షీల ఏమీ అనలేదు కాని మర్నాడు శంకరరావుకి ఫోను చేసింది. ''నువ్వు ఏకాంతంగా మాట్లాడాలన్నావుకదా - అని నేను ఫూల్ ప్రూఫ్ ప్లాన్ వేసుకొని వస్తే అల్లా చేసావేం ?''

''అందులో పార్వతి నిరికించటం ఎందుకు ? నన్ను కలుసుకోమని ఫోన్ చేస్తే చాలుకదా ?'' అని అడిగాడు శంకరరావు. శంకరరావుకి షీల పట్ల ఆకర్షణతోపాటు, పార్వతి పట్ల అనుమానంతోపాటు, పార్వతి పట్ల అభిమానం అనురాగం కూడా వున్నాయి. తన మధ్య షీల మధ్య పార్వతిని ఫూల్ చెయ్యడం శంకరరావు కిష్టంలేదు

''బావుంది మనిద్దరం ఏ కారణం లేకుండా వూల్‌వర్త్స్‌లో ఏకాంతంగా కలుసుకొని ఎవరి కంటైనా పడ్తే బావుంటుందా ?''

''పోనీ మా యింట్లో కలుసుకొందామా ?''

షీల హడిలిపోయింది. అందులో తనకి క్షేమం లేదు దొరికిపోతే షీలేం అమాయకురాలు కాదు తనిష్టపడే శంకరరావుని కల్పుకొంది లేకపోతే పార్వతి ఇంట్లోలేని సమయంలో వాళ్లింటి కెందుకు వెళ్లింది ? అని అడుగుతారు. తనకి శంకరరావు నుంచి కావాల్సింది హాప్‌లెస్‌నెస్.

అతన్ని తన చుట్టూ తిప్పుకొంటుంటే బావుంటుంది. తన ఆకర్షణలో పడి తన చుట్టూ కుక్కలా తిరగాలి. ఏదైనా బెడిసికొడితే ''నాకేం తెలియదు అతనే ఎంత చెప్పినా వినకుండా నా వెంటపడ్డున్నాడు'' అని చెప్పి తప్పుకోగలిగి వుండాలి!

''వద్దు. మీ ఇంటికి రాను.''

''పోనీ మీ యింటికి రానా ?''

''కృష్ణ లాబ్‌లో బోర్‌కొట్టినప్పుడల్లా యింటికి వచ్చే అలవాటుంది. ఏరోజున ఎన్నింటికి యింటికి వస్తాడో తెలియదు.''

''అయితే మరి మనం కలుసుకోడం ఎందుకు ?''

''ఏమో నాకేం తెల్సు!''

''నీకు నిజంగా తెలియదా? మనం కల్సుకున్నప్పుడు ఏమి అడుగుతానో నీకు తెలియదా ?''

''తెలియదు.''

''తెల్సుకోవాలనిలేదు.''

''నువ్వే చెప్తావుకదా!''

''నువ్వు గడుసుదానివి.''

''నువ్వల్లా మాట్లాడ్తే నీతో మాట్లాడను.''

''నువ్వు నన్ను ప్రేమిస్తున్నానని అనలేదూ ?''

''నేను అనలేదు నువ్వే అన్నావు!''

''నువ్వేం అన్నావ్ ?''

''నేను ఏమీ అనలేదు.''

''పోనీ ఇప్పుడేం అంటున్నావ్ ?''

''ఇప్పుడు ఏమీ అనను నువ్వేమన్నా అంటే వింటాను.''

''మన వ్యవహారం ఎటుకేసి దారితియ్యాలని మనం అనుకొంటున్నాం అన్న విషయం మనం తెల్సుకోవద్దూ ?''

''ఎక్కడకి దారితియ్యాలని నేను అనుకోడంలేదు.''

''పోనీ నాకు నీపట్ల ఆకర్షణ వున్నట్టు నీకు నాపట్ల వుందా ?''

''నీకు ఆకర్షణ వుందని తెలుసు.''

''ఆ సంగతి నాకూ తెలుసు. నీమాట ?''

''నువ్వంటే నాకిష్టం.''

''ఆ యిష్టానికి పర్యవసానం ఏమిటి ?''

''ఏమీలేదు''

''ఆ యిష్టం ఏమి చూసి ?''

''నాపట్ల నీకున్న ఆకర్షణ చూసి నీ టేస్టు చూసి''

''థాంక్స్! దీనికిక్కడితో మంగళం పాడేద్దాం! నాకేవిధమైన ప్రయోజనంలేకుండా, నా సంసారం నేను పాడుచేసుకోను వ్రతం చెడ్డా ఫలితం దక్కాలంటారు'' శంకరరావు కోపంగా అన్నాడు.

''నువ్వు నానుంచి ఏమి ఆశిస్తున్నావు ?''

గొంతు వణికింది

''కనీసం నీ మనస్సు.''

''నాకు పెళ్లయిపోయింది. నీకూ పెళ్ళాం వుంది.''

**జరిగిన కథ - 9 :** కొత్త జీవితం గడపటానికి స్వదేశం నుండి ఆస్ట్రేలియా వెళ్లిన శంకరరావుని, పార్వతిని – రంగస్వామి, ప్రొ. బ్రౌన్‌లు సాదరంగా ఆహ్వానించి వాళ్ల ఫ్లాట్‌కి తీసుకు వెళ్తారు. పార్వతి టీచర్ ఉద్యోగానికి ప్రయత్నించి నిరాశ చెందుతుంది. తర్వాత కొన్నాళ్ళకు ఒక బట్టల కంపెనీలో ఉద్యోగానికి చేరుతుంది. ఉన్నంతలో 'వినాయక చవితి' పండుగ జరుపుకుంటారు శంకరరావు దంపతులు. శంకరరావు పనిచేస్తున్న యూనివర్శిటీలోని విద్యార్థులు తమ జీతాలు తగ్గించాలని ఆందోళన చేస్తూంటారు. శంకరరావు, రంగస్వామి కారును కొందామని ప్రయత్నాలు జరుపుతుంటాడు. హరే రామ, హరే కృష్ణ సమాజంలో చేరిన హారీకి అతని తల్లి 'జోన్' పడే బాధను తెల్పి, ఇంటికి వచ్చేయమంటాడు శంకరరావు. స్మిత్‌ల ఇంటికి భోజనానికి వెళ్తారు శంకరరావు, పార్వతి పాశ్చాత్య నాగరికతా మోజులో పడిన భర్త కోసం వేషధారణ మార్చుకున్నా, షీల వ్యామోహంలో పడిన శంకరం దేశం కాని దేశంలో తనకి అన్యాయం చేస్తాడేమోనని వాపోతుంది పార్వతి ఒకళ్లమీద ఒకళ్లు నిఘా వేసుకుంటూ ఉంటారు శంకరం దంపతులు

"ఈ విషయం నీకెప్పుడు తెల్సింది ?"

"అల్లా అంటే ఏమి చెప్పను ?"

"ఎందుకాడావు ఈ ఆట ?"

షీల ఏడుపు మొదలుపెట్టింది

"నీలాంటి టాల్ హేండ్సమ్ పర్సన్ నాకు హస్బెండ్ అవాలని కోరుకొనేదాన్ని నిన్ను చూడగానే ఆ విషయం పదే పదే గుర్తుకురావడం మొదలుపెట్టింది కనీసం నీతో ఫ్రెండ్‌షిప్ చెయ్యాలన్న కోరికతో ఆకర్షించాను. కాని నాకు తెలియకుండా నేను నిన్ను ప్రేమించడం మొదలు పెట్టాను కాని యివాళ కృష్ణని వదిలిపెట్టి నిన్ను పెళ్ళి చేసుకొనే ధైర్యం నాకు లేదు. పార్వతిని వదిలిపెట్టి నన్ను పెళ్ళి చేసుకొనే ధైర్యం నీకున్నా ఇండియాలో వున్న అక్కయ్యలు, అన్నయ్యలు, అమ్మా నాన్నా నా గురించి ఎంత చీప్‌గా ఊహిస్తారు! కృష్ణ చాటున నీతో..."

వాక్యం పూర్తిచెయ్యకుండా షీల ఫోను పెట్టేసింది

శంకరరావుకి అర్థమైంది, కృష్ణతో వుంటూ కృష్ణను మోసంచెయ్యటం షీల కిష్టంలేదని నిజానికి శంకరరావుకి కూడా పార్వతిని మోసంచెయ్యటం ఇష్టంవుండటంలేదు తనకి షీలకి మధ్య ఏమీ జరగకుండావుండటం కూడా ఒకందుకు మంచిదే! తను గిల్టీగా ఫీలవకుండా పార్వతితో కాపురం సాగించగలడు. తమ పరిచయంలో ఆకర్షణే వుంది కాని తట్టుకోలేని వ్యామోహం లేదు తనలాగే షీలకి కూడా పరజాతిని ఆకర్షించాలన్న తపనే ఎక్కువగా వుండివుంటుంది అనుభవంపట్ల యిద్దరికి వ్యామోహం లేదు! అందుకే ఏ పొరపాటు జరగకముందే తమ పరిచయానికో గింపు అయింది. అంతగా మగవాళ్ళపట్ల ఆకర్షణ వుండి వాళ్ళని ఆకర్షించాలన్న కోర్కె వున్న షీలే తప్పటడుగు వెయ్యడానికి జంకింది అల్లాంటప్పుడు పార్వతి వెయ్యగలదా? తన అనుమానమేగాని పార్వతి నడతలో చెడు ఏముంది? ఇవాల్టితో ఈ అధ్యాయం అయిపోయింది అనుకొన్నాడు శంకరరావు

పార్వతికి జరిగినదంతా చెప్పి శంకరరావు క్షమాపణ కోరలేదు! నిజానికి జరిగింది ఏముంది కనక చెప్పడానికి మనస్సు కొంచెం చలించి సర్దుకుంది అనుకొన్నాడు అందుకనే పార్వతితో ఆస్ట్రేలియా వచ్చిన కొత్తరోజుల్లోలాగా అభిమానంగావుండటం మొదలుపెట్టాడు

కృష్ణని, షీలను చూడటం శంకరరావు తగ్గించుకొన్నాడు అదే పదివేలనుకొని పార్వతి ఏరోజు వాళ్ళింటికి వెళ్దామని అనలేదు. ఒకరోజు షీల, శంకరరావుకి యూనివర్సిటీలో కనిపించి,

"బావున్నారా ?" అని పలకరించింది

"బావున్నాము" కావాలని వున్నాను అనకుండా వున్నాము అన్నాడు అని ఆపైన "మీరెల్లా వున్నారు ?" అని అడిగాడు

"విచారంగా వున్నాను' అంది షీల

"ఎందుకు ?" అని అడిగాడు శంకరరావు

"మీరు పూర్తిగా మా యింటికి రావటం మానేసారు కదా! మేం ఏం పాపం చేసాం ? మాతో ఎవరు స్నేహం చేసినా ఇంతే కొంత కాలం




స్నేహంగా ఉండి చాలా దగ్గరగా వచ్చి దూరంగా జరుగుతారు."

"ఇవన్నీ మనం యూనిలో మాట్లాడటం ఏమి బావుంటుంది!"

"నాకు నీతో మాట్లాడాలని వుంది. మా యింటికి వచ్చి కాఫీ తీసుకోండి"

"కృష్ణ ఏవేళనైనా రావచ్చు కదా!"

"మనం ఏమీ తప్పుపని చెయ్యటంలేదు! పైగా కృష్ణ సిటీలో పనుందని వెళ్ళాడు. సాయంత్రందాకా రాడు అందుకని శంకూ! మా యింటికి రా మాట్లాడుకుందాం. నీకు నాతో ఏకాంతంగా మాట్లాడాలన్న కోరిక తీరుతుంది" అంది షీల.

శంకరరావు సందిగ్ధంలో పడ్డాడు, ఇప్పుడు మళ్ళీ షీలతో తను పరిచయం పెంచుకోవడం ఎంతవరకు సమంజసం అన్నది తేల్చుకోలేక.

షీల దారితీసింది. శంకరరావుకి అనుసరించక తప్పలేదు షీల పార్కింగ్ ప్లేసుకి నడిచింది శంకరరావు కారు తీసాడు ఇద్దరు షీల యింటికి చేరారు.

"నువ్వు విస్కీ తీసుకొంటావా శంకూ!"

"వద్దు కాఫీ చాలు డే టైమ్‌లో తాగను."

"పోన్లే నీకు కాఫీ ఇచ్చి నేను విస్కీ తాగుతాను"

షీల వంటింట్లోకి వెళ్ళి పర్కొలేటర్‌లో పొడి వేసి నీళ్ళు పోసి పొయ్యిమీద పెట్టింది రెండు నిముషాల్లో కాఫీ చేసి కప్పులో పోసి శంకరరావు కిచ్చింది తను విస్కీ పోసుకొంది గ్లాసులో.

"నీకు నాతో ఏకాంతంగా మాట్లాడాలని ఉందన్నావు. నీకంటే ఎక్కువగా నాకు మాట్లాడాలని ఉంది. తాగితే కాని మనస్సులోని అగాధాలలోకి గట్టిగా తొక్కిపట్టిన భావాలు బయటికి రావు." విస్కీ గడగడ తాగేసింది షీల.

లేచి వెళ్ళి మరో కాస్త విస్కీ వంచుకొని వచ్చి మాట్లాడటం మొదలుపెట్టింది.

"మా ఇంట్లో అందరు మా అక్కలందరి కంటే నా కందం తక్కువ అని నా మొహాన్నే అంటుండేవారు. దాంతో నేనూ అందమైన దాన్నేనని అనిపించుకోవాలన్న తాపత్రయం చిన్నప్పటినుంచి నాకు ఎక్కువగా వుండేది అందుకనే కాలేజీలో అబ్బాయిల్ని, మేష్టర్లని కూడా కవ్వించేదాన్ని. నన్నెవరో రాజకుమారుడు పెళ్ళాడ్తాడని అనుకొనేదాన్ని అందుకే చదువులో కూడా నేను మా అక్కయ్యలలాగా రాణించలేదు. ఆఖరికి మా నాన్న అందరికి మంచి వరుళ్ళని తెచ్చి నాకు కృష్ణని వరుడిగా కుదిర్చాడు"

"కృష్ణకేం తక్కువ ?"

"ఇండియాలో ఉద్యోగం తక్కువ ఆ లోటు కనిపించకుండావుండాలని నేను పోరుపెట్టి ఈ దేశం ప్రయాణం పెట్టాను విదేశాల్లో కూలీ

ఉద్యోగం చేసినా మన దేశంలో మనవాళ్ళు మా అమ్మాయి అల్లుడూ విదేశాల్లో వున్నారు అని గొప్పగా చెప్పుకొని మురుస్తారు. ఈ దేశం వచ్చాక నాకు కొత్త సమస్య ఎదురైంది కృష్ణ బద్ధకస్తుడు కష్టపడి తన ప్రొఫెషన్‌లో పైకి రాలేకపోయాడు దాంతో ఫ్రస్ట్రేషన్, తాగుడు మొదలయ్యాయి అయితే తాగుడు ఖర్చుతోకూడిన పని గుజరాతీవాళ్ళకి డబ్బుతో లంకె ప్రాణానికి కృష్ణకి ఇతర్ల ఖర్చుమీద తాగడం యిష్టం''

''అది కొంచెం నేనూ నోటిస్ చేసాను''

''కొంతమంది బాచ్‌లర్స్, మన దేశీయులే, నాతో లాగితే వాళ్ళకి వచ్చే థ్రిల్‌కోసం, వాళ్ల ఖర్చుతో భాటిల్స్ కొనేవాళ్ళు నేను తాగి, వాళ్లతో మైకంగా మాట్లాడితే, వాళ్ళకి గొప్ప కిక్ వచ్చేది కృష్ణ అది గమనించికూడా చూడనట్టు ఊరుకొనేవాడు వాళ్ళు దాంతో విజృంభించి నాకు కృష్ణ ఎదురుగానే కాంప్లిమెంట్స్ ఇవ్వడం, కృష్ణ చూడకుండా, నాకేసి కొంటెచూపులు విసరడం మొదలుపెట్టారు చిన్నప్పటినుంచి నన్ను ఆరాధించేవాళ్లు కావాలనుకొనేదాన్ని అందుకని వాళ్ల కంపెనీ నేను ఎంజాయ్ చేసేదాన్ని. అయితే వాళ్ళు నానుంచి అంతకంటే ఎక్కువే ఆశించారు నేను దానికి సిద్ధంగాలేను ఇక్కడ నిజంగా నేను చెడిపోతే మళ్లీ ఏ మొహంపెట్టుకొని ఇండియా వెళ్ళగలను? మా నాన్న చాలా స్ట్రిక్ట్. అందుకనే, నేను వాళ్ళకి అందలేదు దాంతో వాళ్ళు రావటం తగ్గించుకొన్నారు''

''ఆ తరువాత మీ సర్కిల్‌లోకి మేము వచ్చుంటాము''

''అవును నువ్వు పార్వతి వచ్చాక మరోరకం సమస్య ఎదురైంది ఈసారి నువ్వు నన్ను ఆరాధించటంతోపాటు నువ్వంటే నాకు నిజమైన ఆకర్షణ కలిగింది. నువ్వు కూడా నానుంచి

# ఆకర్షణ - వ్యామోహం

నేనివ్వటాని కిష్టపడిన కంపెనీకంటే అధికంగానే ఆశించటం మొదలుపెట్టావు. అయితే పూర్వ పరిచయస్తుల విషయంలోలాగా కాక నువ్వంటే నాకుకూడా ఆకర్షణ వుండటంచేత నువ్వు గట్టిగా వత్తిడిచేస్తే నీకు నేను లొంగిపోతానేమోనని భయం పట్టుకొంది.'' షీల మరోసారి తన గ్లాసు విస్కీతోను శంకరరావు కప్పు కాఫీతోను నింపింది

'ఇవాళ ఇదంతా, నన్ను పిలిచి చెప్పటంలో నీ ఉద్దేశం?''

''అన్నింటికి సిద్ధపడి ఆకర్షణలోంచి తేరుకొని బయటపడలేక.''

శంకరరావు షీలను సమీపించాడు షీల సన్నగా ఏడవసాగింది. శంకరరావు జేబురుమాలో షీల కన్నీళ్ళు తుడుస్తూ,

''నువ్వు కృష్ణని, నేను పార్వతిని ఇంతవరకు మోసంచెయ్యలేదు ఇకముందు చెయ్యవద్దు మనం మంచి స్నేహితులుగా మిగిలిపోదాం. నువ్వూ మా ఇంటికి వస్తూవుండు. నేను వస్తూవుంటాను ఇంతకుమించిన సంబంధం మనమధ్య వద్దు'' అన్నాడు.

శంకరరావు తలుపు తెరుచుకొని వెళ్లిపోతుంటే షీల దిగాలుపడి కూర్చుంది సముద్రం చెలియలి కట్ట దాటలేదు!

## 13

శంకరరావు, పార్వతికి షీల గురించి ఏమీ చెప్పలేదు. చెప్పి బాధపెట్టడం ఎందుకని మానేసాడు. పూర్వంకంటే పార్వతిపట్ల అభిమానంగా ఉండటం మొదలుపెట్టాడు. పైగా వీలైనప్పుడల్లా సాయంత్రాలు స్కూలుకి వెళ్లి పార్వతిని ఇంటికి తీసుకువచ్చేవాడు. హెడ్‌మాస్టర్ రిఫ్ట్‌లు ఇవ్వాల్సిన అవసరం బాగా తగ్గించాడు







శంకరరావు అభిమానంగా వచ్చి తీసుకువెళ్తూ ఉంటే పార్వతి మనస్సుకి కూడా తృప్తిగా ఉంది నాగరికత పేరుతో ఎరాయి స్త్రీ పురుషుల మధ్య చనువు ఏర్పడటంవల్లనే అనర్థాలకి దారి తీస్తుందని అందుకని అటువంటి అవకాశాలను కలిగించని పద్ధతులే మంచివని అనుకొన్నారు ఇద్దరు.

వేసంగి వచ్చింది వనజకి బాబ్‌కి ఎంగేజ్‌మెంట్ అయింది ఇయాన్ బెట్టీ ఆ సందర్భంలో పార్టీ యిచ్చి పార్వతిని పార్టీకి పిలిచారు ఈ పెళ్లికి రంగస్వామి లక్ష్మి మనస్ఫూర్తిగా సమ్మతించారు. పార్వతి వనజని అభినందించింది ''నీ బియ్యే పరీక్ష అయిపోగానే బాబ్‌తో ఎంగేజ్‌మెంట్ అయిపోయింది నీకు ఇదే ఇండియాలో అయితే ఓ పాతిక పెళ్లికొడుకుల ముందు కూర్చోవటం వాళ్లేమో ప్రపంచంలో ఉన్న ఆడపిల్లల్నందర్నీ ఉద్ధరించడానికి పుట్టిన కారణజన్ములమనుకోవడం మీ నాన్నగారి చెప్పులరిగిపోవటం ఆపైన బాంకులో నిలవ తరిగిపోవటం, అయ్యాక, నీకు పెళ్లి జరిగేది ఇక్కడ పెళ్లికూతురువయిన నువ్వు చాలా అదృష్టవంతురాలివి'' అంది పార్వతి.

''థాంక్స్! పారూ! మా అమ్మని నాన్నగారు చూడకముందు ఓ ముప్ఫైమంది చూసారుట. అంతమంది చూసి నచ్చలేదన్నప్పుడు అమ్మ పడిన బాధ ఇంత అంత కాదుట. దారినపోయేవాడు చేసుకొంటానన్నా చేసుకొని తాతగారి బరువు దింపాలనుకొనేదిట అఫ్ కోర్స్ చివరికి అమ్మకి అన్నింటికంటే మంచి సంబంధమే అయింది'' అంది వనజ.

''నీలాంటి మంచి పిల్లని మీ నాన్నగారికి నాకోసం కనాన్న ఉన్నప్పుడు మరొకరితో ఆవిడ పెళ్ళెలా అవుతుంది'' అన్నాడు బాబ్ వనజ నడుం చుట్టూ చెయ్యి వేస్తూ వనజ సిగ్గులమొలక అయింది

పెళ్లికూతురవగానే వనజకి సిగ్గుపడటం కూడా సహజంగా అబ్బిందే అని ఆశ్చర్యపోయింది పార్వతి

''మరో రెండు మూడు నెలలకి వనజకి పెళ్లి చేస్తాం ఆపైన సన్యసిస్తాం'' అన్నాడు రంగస్వామి హాస్యంగా. కాని వున్న ఒక్క కూతురికి పెళ్లి చేసి పంపించడంలో వాళ్ళు పడే బాధ రంగస్వామి కనుకొలుకుల్లో నిలచిన కన్నీటిబిందువు దాచలేకపోయింది

''మీ మనవలు మనవరాళ్ళు మిమ్మల్ని సన్యసించనీయరు పైగా ఆస్ట్రేలియాలో ఇంతమంది పిల్లలుంటే అంత గొప్పకదా! వనజ దికొకళ్ళని కనేసి తాతకి పని చెప్తుంది. వనజా! మీ నాన్నగారు పెళ్లికి కట్నం అవీ ఆస్ట్రేలియా పేరు చెప్పి ఎగ్గొడుతున్నారు. కనీసం నీ పురిటి ఖర్చులైనా నీ పుట్టింటివారిచేత పెట్టించడం ధర్మం ... అదేమిటి. అన్ని విషయాలు అంత ఫ్రీగా మాట్లాడే వనజ ... తన పిల్లల విషయం వచ్చేసరికి అంత సిగ్గుపడుతోంది! నువ్వు సిగ్గుపడుతుంటే ఎంత అందంగావున్నావో తెల్సా! అందుకే బాబ్ నిన్ను

చేసుకొంటున్నాడు నాకు తెలిసిపోయింది'' అన్నాడు శంకరరావు

''థాంక్స్!'' అంది వనజ నవ్వుతూ!

''వనజకి బిగ్‌ఫామిలీ కావాలట నేను చాలా హార్డ్ వర్క్ చెయ్యాల్సివుంటుంది'' అన్నాడు బాబ్ వనజ అక్కడనుంచి తప్పుకొంది

వనజ బాబ్‌ల ఎంగేజ్‌మెంట్‌పార్టీ అయిన మర్నాడు ఆలస్యంగా లేచారు పార్వతి, శంకరరావు ఆరోజు ఆదివారం కాఫీ కలుపుకొని తాగుతుంటే డోర్ బెల్ మోగింది. శంకరరావు వెళ్లి తలుపు తీసాడు అంత పొద్దున్నే వచ్చినవాళ్లు కృష్ణ షీలలు. షీల మొహం అంతక్రితమే ఏడ్చినట్టుగా వాడిపోయింది కృష్ణ మొహం కోపంగా కందగడ్డలా వుంది శంకరరావు జంకుతూనే 'రండి' అని లోపలికి ఆహ్వానించాడు

పార్వతి షీలకి కృష్ణకి కూడా తనతోపాటు కాఫీ కలిపి తీసుకువచ్చింది

''బాబు లేవలేదా ?'' అని అడిగింది షీల

''లేదు'' అంది పార్వతి

''శంకూ! నువ్వింత ద్రోహం చేస్తావని అనుకోలేదు'' అన్నాడు కృష్ణ.

''ఆయనేం చేసారని అల్లా అంటున్నావ్? అందులోను మా యింటికి వచ్చి.'' అని పార్వతి కోపంగా అడిగింది

''షీలకు నువ్వు ఫోన్ కాల్స్ చెయ్యలేదా శంకూ ?'' అని కృష్ణ నిలదీసాడు

''కృష్ణ కంతా తెలిసిపోయింది'' అంది షీల.

''ఏముంది తెలియడానికి ?'' అని శంకరరావు అనుమానంగా అడిగాడు

''నువ్వు నా అందం కళ్లు చెదిరేలా ఉంటుం దని, అందుకని నువ్వు నన్ను ప్రేమిస్తున్నావని చెప్పిన విషయం కృష్ణకి తెలిసిపోయింది'' అంది షీల

''ఏమండీ! కాని దేశంలో నా కింత ద్రోహం తలపెట్టారా ?'' అంటూ పార్వతి ఏడ్పు మొదలు పెట్టింది. పార్వతి, అనుమానిస్తూనే ఉన్నా అటువంటిది జరిగిందని షీల అన్నప్పుడు పార్వతి భరించలేని బాధకు గురైంది. టేబుల్‌మీద కాఫీలు చల్లారిపోతున్నాయి ఎవరికి తాగే మూడ్ లేదు

శంకరరావు ఆశ్చర్యపోతున్నాడు షీల ఏదో ప్రయోజనాన్ని ఆశించి ఏదో నాటకం ఆడుతోంది సమ్మె ఉంటుంది కృష్ణకి తనకి షీలకు మధ్య నడచిన ఉదంతం కొంచెం తెలిసి ఉంటుంది తనని రక్షించుకోడానికి షీల జరిగినదాన్ని కృష్ణకి రంగుటద్దాలలో చూపించి ఉంటుంది. ఆ రంగు టద్దాలలోంచి చూస్తే తను దోషి అయ్యుంటాడు షీల అమాయకురాలిలాగా కన్పించి ఉంటుంది.

''నీకు ఏమి తెల్సింది కృష్ణా? ఎల్లా తెల్సింది ?'' అని శంకరరావు అడిగాడు తనని తాను సంబాళించుకొంటూ.

''నువ్వు షీలకు కార్లలో లిఫ్ట్‌లు ఇవ్వడం తెల్సు ఫోను కాల్స్ చెయ్యడం తెల్సు ప్రేమించడం తెల్సు ఇంకేం తెలియాలి ? ఇందులో ఏమన్నా అబద్ధం ఉందా ?''

''నేను షీల అడిగితే షీలను కార్లో దించిన మాట నిజమే ఆ విషయం పార్వతికి కూడా తెల్సు దానిలో నా తప్పులేదు. పోతే ఈ దేశంలో ఆడవాళ్ళకి మగవాళ్ళు కాంప్లిమెంట్స్ ఇవ్వడం సర్వసాధారణం. నేనే కాకుండా షీలకి చాలామంది కాంప్లిమెంట్స్ ఇచ్చి ఉంటారు. పైగా నువ్వు కూడా పార్వతికి చాలాసార్లు ఇస్తే వుంటావు ఈ చిన్న విషయం కోసం ఇంత పొద్దున్నే వచ్చుండవు. ఇంకపోతే నేను షీలను ప్రేమించడం గురించి నీకు షీల దాని గురించి ఏమి చెప్పిందో ముందు నేను తెల్సుకోవాలి. ఏం చెప్పింది షీల ?'' శంకరరావు జాగ్రత్తగా తూచి తూచి మాట్లాడదల్చుకొన్నాడు. క్రాస్ ఎగ్జామినేషన్‌లో తను కొత్త విషయాలు ఏమీ బయటపెట్టదలుచుకోలేదు. షీల కాపురానికి తను హాని చెయ్యడు. తను నష్టపోయినా సరే!

''నేనేం చెప్పలేదు కృష్ణ నా డైరీ చదివాడు నిన్నరాత్రి అప్పటినుంచి నీమీద కారాలు మిరియాలు నూరుతున్నాడు'' అంది షీల

''నా ఒక్కడిమీదేనా ?'' అని అడిగాడు ఆశ్చర్యంగా శంకరరావు

''నామీదెందుకు నూర్తాడు. నువ్వు నావెంట పిచ్చెత్తినట్టుగాపడితే నా దా తప్పు ? ఎన్నోసార్లు పార్వతితో శంకరరావు నా వెంటపడకుండా చూసుకో! అతనికేదో సుఖం ఇవ్వలేకపోతున్నావ్ అందుకే అల్లా నా వెంటపడుతున్నాడు అని చెప్దామనుకొన్నాను నిన్ను డైరెక్టుగా కసురుకొంటే బాధపడ్తావని ఆలోచించేదాన్ని కసురుకోకుండా నిన్ను నా వెంటపడకుండా చేసుకోడం ఎల్లాగా అని రోజు సతమతమై పోయేదాన్ని.''

షీల ఏమిటి మాట్లాడ్తోందో? ఎందుకు మాట్లాడ్తోందో శంకరరావుకి అర్థమైపోయింది షీల తన ఇగోని తృప్తిపరుచుకోడంకోసం ఓ పెద్ద కథ వ్రాసుకొని వుంటుంది డైరీలో. తన అందమే తనకి శత్రువైనట్టు, తను అంత అందకత్తెగా పుట్టడంవల్లే తన వెంట శంకరరావు పడుతున్నట్టు, కృష్ణని పార్వతిని మోసంచెయ్యటం తన కిష్టంలేనట్టు, ఏమాత్రం తను శంకరరావుని సహించినా అది అతనిమీద జాలికొద్దీ మాత్రమే చేసినట్టు వ్రాసుకొనివుంటుంది చిన్నప్పటినుంచి వున్న ఇన్‌ఫీరియారిటీకాంప్లెక్స్ వల్ల తన డైరీ కథలో తన్ను జాలి, అందం మంచితనం అన్నీ వున్న తెలుగు సినిమా హీరోయిన్‌లాగా చిత్రించుకొనివుంటుంది. శంకరరావు పార్వతికేసి చూసాడు. పార్వతి అతని చూపు తనవైపు తిరగగానే,

''ఏమండీ మీకు నేనేదైనా సుఖం యివ్వలేక పోతున్నానా ? అంత మాట షీల నన్ను ఎలా అనగలిగింది ? మీరు షీలతో ఏం చెప్పారు ? తను అల్లా అర్థం ఎందుకు చేసుకొంది ? చెప్పండి ... చెప్పండి ... నేను భార్యగా మీకు సుఖం ఇవ్వకపోతే ముందరగా నాతో ఓ మాట చెప్పలేకపోయారా ? నేనివ్వలేనిది షీల దగ్గర పొందుదామనుకొన్నారా? నాకింతకంటె అవమానం వుందా!'' అంటూ పార్వతి భోరుమంది.

శంకరరావుకి బుర్ర తిరిగిపోతోంది ఏమీ జరగకుండానే ఎంతో జరిగినట్టుగా కృష్ణ, పార్వతి ఊహిస్తున్నారు. షీల ఏ కారణాలచేత నైనప్పటికి, డైరీలో కొన్ని అబద్ధాలు వ్రాసుకొని ఉంటుంది కృష్ణ అవి నమ్ముంటాడు తనని నిర్దోషిగా చిత్రించుకొన్న నాటకంలో షీల చివరి సీను డైలాగ్స్ చెప్తోంది. అయితే ఆ పని చేస్తూ పార్వతి గుండెలకి తగిలే సమ్మెటపు పోట్లని పట్టించుకోడంలేదు.

''నిజమే కృష్ణా! నాదే తప్పు. నన్ను క్షమించు. కాని షీల డైరీ నువ్వు చదివి ఉంటే నేను షీల వెంటపడటం మానేసి చాలా రోజులైన విషయం ఉండాలే ఎన్ని రోజులక్రితం నేను చివరిసారిగా షీలను ఇబ్బంది పెట్టానుట ?'

''ఆర్నెల్లక్రితం నువ్వు షీలను ఏకాంతంగా కలుసుకొని మాట్లాడాలని అన్నావని రాసాక డైరీ రాయటం మానేసింది తరువాత కథ ముదిరి ఉంటుంది.''

శంకరరావు ఊహ సరైనదే! అందులో షీల, తనతో ఫుల్ వర్త్ ఆన్ షాపులో వల్ల స్వెట్టర్ కొనడం సంగతి లేదు. తనని వాళ్లింటికి పిలవటం సంగతి లేదు షీలకి తన పేరు ప్రతిష్టలు పాడవటం ఇష్టంలేక అవన్నీ వ్రాసుకోలేదు తన కథలో తను నాయకి. నాయకిలో చెడు ఉండదు నిజం నిజంలా వ్రాసుకొంటే తన సంసారం పాడవుతుంది కథ విషాదాంతం అవుతుంది ఎటు పోయి ఎటు వచ్చినా తనకేం ప్రమాదం ఉండరాదు అందుకనే ఆ విధంగా ఎవిడెన్సు బిల్డప్ చేసి ఉంటుంది కృష్ణకి ఎప్పటికైనా తన వ్యవహారం తెలియవచ్చునన్న భయం షీలకు అంతర్గతంగా ఉండి ఉంటుంది అందుకనే షీల అల్లా డైరీ వ్రాసింది శంకరరావు షీలను బోనెక్కించదలుచుకోలేదు సమాజం మగవాడిని క్షమించినట్టు ఆడదాన్ని క్షమించదు

''కృష్ణా! జరిగినదేదో ఆర్నెల్లకి పూర్వమే జరిగి, ఆర్నెల్లక్రితం ఆగిపోయింది నేను షీల వెంట పడి షీలకు చాలా ఇబ్బంది కలిగించాను అందుకు షీలని నిన్ను కూడా క్షమించమని అడుగుతున్నాను చాలా రోజులుగ నేను నాదుష్ ప్రవర్తన మానుకొన్నాను అందుకని కృష్ణా! నేనింక భవిష్యత్కాలంలో షీలతో మిస్ బిహేవ్ చెయ్యను కనక నువ్వు నాకీనాడు బుద్ధులు గరపడం వేస్టు. శ్రమపడకు. ఇవాళ నీకు నన్ను నా మర్యాద దక్కదని బెదిరించాల్సిన అవసరం లేదు. షీలకు కూడా నన్ను బెదిరించాల్సిన అవసరం లేదు. ఇంకపోతే షీల తప్పేమిలేదు జరిగిన దాంట్లో! అంతా నా చపలత్వంవల్లే జరిగింది. కనక మీ కాపురం మీరు చక్కగా చేసుకోండి. దయచేసి మీ యింటికి మీరు వెళ్లండి. పార్వతి నన్ను క్షమించి నాతో కాపురం చేస్తుందో లేదో నేను తెల్సుకోవాలి'' అన్నాడు శంకరరావు. శంకరరావు తనంత ఉద్రేకరహితంగా మాట్లాడగలిగినందుకు ఆశ్చర్యపోయాడు కృష్ణ, షీలలు మాట్లాడలేదు.

**/ఇంకా వుంది/**

**సినిమా**

# 1978 లో చిత్రాల ధోరణి



'కమలమ్మ కమతం'లో పల్లవి, కృష్ణంరాజు

1978 లో విడుదలైన చిత్రాలను పరిశీలిస్తే ... అగ్రతారలు నటించిన స్కోప్ కలర్ చిత్రాలకు ప్రేక్షకుల తిరస్కృతి లభించింది అనే చెప్పాలి.

ప్రేక్షకుల అభిమానాన్ని ఆసరాగా తీసుకుని.. నిర్జీవమైన పాత్రలను పోషించడానికి సుముఖంగా వున్నారు అగ్రతారలు అనెడి నిజాన్ని భరించజాలము అని, చిత్రాల ఫలితాల ద్వారా గుణపాఠం నేర్పారేమో అనిపిస్తుంది, '78 రిజల్ట్స్.

మేమిచ్చే డబ్బుకు, రెండున్నరగంటల వినోద కాలక్షేప మొక్కటేకాదు ... కాస్త లాజిక్ వున్న "సంఘటన సన్నివేశాలుకూడా" అని ప్రేక్షకులు సూటిగా చెప్పారు.

కథలో పటుత్వం లేకపోతే...చెప్పే విధానంలో ఆకర్షణ గోచరించకపోతే ... ఏ హీరో నటించినా... ఆ చిత్రానికి స్వాగతం పలకము అని నిస్వార్థ ఫలితాన్ని మన ప్రేక్షకులు యివ్వగలిగారు

1978 లో పెద్ద హీరోల చిత్రాలకన్నా .. కథాబలం వున్న చిత్రాలకే ప్రజామోదం లభించడం ... జనమెరిగిన నిజం.

**ఉత్తములు ఎవరు ?**

1978 లో విడుదలైన చిత్రాలలో శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు నిర్మించిన "రాధాకృష్ణ" వర్ణ చిత్రానికి ప్రథమ స్థానాన్ని, శ్రీ దాసరి నారాయణరావు రూపొందించిన "శివరంజని" స్కోప్ వర్ణ చిత్రానికి ద్వితీయ స్థానాన్ని యివ్వడం సమంజసమేమో !

దర్శకులలో శ్రీ దాసరికి అగ్రతాంబూలం యివ్వాలి ! (శివరంజని చిత్రీకరణకు) ఒక నటి జీవితాన్ని ఎంతో సహజంగా ... ఎంతో రమ్యంగా, శ్రీ దాసరి చిత్రీకరించడం ... గమనార్హం.

ఉత్తమనటుడుగా "కటకటాల రుద్రయ్య" పాత్రధారి శ్రీ కృష్ణంరాజును సూచించడం సమంజసమే !

ఉత్తమనటిగా శివరంజని పాత్రధారిణిని, రాధాకృష్ణలో రాధ పాత్రధారిణిని, రిషిరాజి పాత్రధారిణిని పేర్కొనాలి

ఉత్తమ విలన్‌గా మోహన్‌బాబును; ఉత్తమ గుణచిత్ర నటుడుగా ప్రభాకరరెడ్డిని, ఉత్తమ విదూషకుడుగా అల్లురామలింగయ్యను సూచించాలి.

శ్రీ అక్కినేనికి "చిలిపి కృష్ణుడు", శ్రీ నందమూరికి "యుగపురుషుడు", శ్రీ శోభన్‌కు "రాధాకృష్ణ", కృష్ణగారికి అన్నదమ్ముల సవాల్, కృష్ణంరాజుగారికి "రుద్రయ్య ... పాండవులు" విజయాన్ని చేకూర్చిన చిత్రాలు

**బంగారు భవిష్యత్తు వున్నది ఎవరికి ?**

ఇటీవల వస్తున్న చిత్రాలపై ప్రేక్షకులకు సదభిప్రాయం లేకపోవడానికి కారణం... నిస్సారమైన కథలు మాత్రమేగాక... నిర్జీవమైన నటీనటుల ప్రజ్ఞ కూడా అని తెలుస్తోంది

"స్టార్ వేల్యూ" వుంటేనే, చిత్రాలకు ఆర్థిక విజయం లభిస్తుందనెడి మూఢనమ్మకంతో ప్రవర్తించే నిర్మాతలకు 1978 చక్కటి గుణపాఠం నేర్పింది !

తెలుగు చలన చిత్ర పరిశ్రమ భవిష్యత్తు బంగారంగా ప్రకాశించాలంటే.. దర్శక... నిర్మాతల బుర్ర పదునుగా పనిచెయ్యాలి. పాత కథలను మళ్ళీ నిర్మించినా...ప్రేక్షకులు చూడగలరు అని యిటీవల విడుదలైన కొన్ని పాత వాసన వున్న కొత్త చిత్రాలు నిరూపించాయి.

అన్ని చిత్రాలలో ఒకే జంటను చూసే ఓపిక ప్రేక్షకులకు నశించింది ఫలానావాళ్ళు వుంటేనే, చిత్రాలను ఆదరిస్తాము అని చెప్పే పిరికితనం ప్రేక్షకులకు లేదు

**రాబోయే సంవత్సరం గూర్చి కొన్ని నిజాలు**

కడచిన సంవత్సరం నిరాశాజనకంగా పూర్తయిన నిజాన్ని... పరిశ్రమ వ్యక్తులు అంగీకరించాలి ఎందుకు అంగీకరించాలో... వాళ్ల మనసులకు తెలుసు

"అడవిరాముడు.. యమగోల" సాధించిన ఆర్థిక విజయాలను చూచి... వాటిని అధిగమించాలన్న దురాశ జీర్ణించుకునిపోయి... కథలపై మక్కువ తప్పించి... బాక్సాఫీసు సూత్రాలపై దృష్టి సారించి... ప్రేక్షకుల శాపానికి గురి కావడం... పరిశ్రమ వ్యక్తులకు తెలిసొచ్చిన నిజం



'సొమ్మొకడిది — సోకొకడిది'లో జయ, కమలహాసన్



'ఎవడబ్బసొమ్ము'లో కృష్ణ, శ్రీప్రియ

సినిమాస్కోప్ చిత్రాల నిర్మాణానికి దాదాపు స్వస్తి చెప్పే మనసు నిర్మాతలకు ఏర్పడడం... శుభావహం

శ్రీయుతులు ఎ బి. సి డి యి ఎటెస్తేనే చిత్రాలు విజయాన్ని సాధిస్తాయి అనెడి మూఢ నమ్మకం, పెద్ద నిర్మాతల మనసునుండి విడిపోవడం శుభావహం

అగ్రశ్రేణి నాయకులకు లక్షలకు లక్షలు కుమ్మరించి నష్టపోవడానికి బదులు... కథలపై కొన్ని వేలు ఖర్చుపెట్టి. సారవంతమైన చిత్రాలను నిర్మించే వుద్దేశ్యం నిర్మాతలకు కలగడం పరిశ్రమకు శ్రేయస్కరం

## థియేటర్ల హై "అద్దె"

చిత్రాల సంఖ్య పెరగడంవల్ల... అన్ని చిత్రాలను ఫీడ్ చేసే థియేటర్లు లేకపోవడంవల్ల.. ''అద్దె'' హిమాలయ శిఖరమంతగా పెరిగింది

నిర్మాతలకు ''హైరు'' తగ్గాలంటే... సంఖ్య తగ్గాలి సంఖ్య తగ్గాలంటే విడుదల తేదీలలో పరస్పర అయికమత్యం రావాలి.

అయికమత్యం అనే ఆయుధాన్ని సక్రమంగా వాడితే... జరిగేది.. వచ్చేది న్యాయమైన ఫలితమే, మరి

## "ద సాగా ఆఫ్ స్టోన్స్"

ఇదొక డాక్యుమెంటరీ చిత్రం పేరు ఈ చిత్రాన్ని డైరెక్ట్ చేసిన వ్యక్తి పేరు యస్. పి రాజారావు ఈ చిత్రం ఢిల్లీ ఫిలిం ఫెస్టివల్‌కు ఎన్నికైంది ఈ రాజారావు ఫిలిం ఇన్‌స్టిట్యూట్‌లో డిప్లొమా (డైరెక్షన్‌లో) సంపాదించారు సురేష్ సంస్థలో అసోసియేట్‌గా కొంతకాలం పని చేశారు

తమ తండ్రిగారి ప్రోత్సాహంతో తెలుగులో తొలిసారిగా ఒక కమర్షియల్ చిత్రాన్ని నిర్మించడానికి నిశ్చయించి, ''హత్యారా'' అనే హిందీ చిత్రాన్ని ఎంపిక చేసారు ''ఈ రోజే (21-11-78) హీరో కృష్ణగారు చిత్రం చూసారు చాలా బాగా ప్లీజ్ అయ్యారు మార్చి నుంచి కాల్‌షీట్స్ యిస్తానన్నారు'' అన్నారు డైరెక్టర్ రాజారావు ''రాజారావుగారి కుమారుని పేరు ఉదయ్ అందుకే వారి బ్యానరుకు ఉదయ్ ఆర్ట్స్ పిక్చర్స్ అని పేరు పెట్టారు ఈ బ్యానరు మీదనే పై చిత్రాన్ని నిర్మిస్తున్నారు కృష్ణగారు, సత్యనారాయణగారు ఇంతవరకు ఎన్నికైన తారాగణం'' అని ఇంకాస్త ఇన్‌ఫర్‌మేషన్ ఇచ్చారు ఆ చిత్రం అసోసియేట్ దర్శకుడు వి రామచంద్రరావు.

''జనవరిలో రికార్డింగ్. మార్చిలో షూటింగ్. ఆగస్టులో రిలీజ్. మాటలు జంధ్యాల. సంగీతం సత్యం మిగతా వివరాలు మరో వారంలో తెలియచేస్తాను ఈ చిత్రంలో యస్. పి వెంకన్న బాబుగారుకూడా భాగస్తులే. నిర్మాణనిర్వాహకుడిగా వెంకన్నబాబు అందరికీ చిరపరిచితులే'' అన్నారు యువదర్శకుడు రాజారావు.

## తెలుగులో "మా"

అమరజీవి శ్రీ దేవర్ నిర్మించిన కమర్షియల్ హిట్ చిత్రాల్లో ''మా'' హిందీ చిత్రం ఒకటి. ఈ చిత్రాన్ని తెలుగులో నిర్మించాలనే ఆలోచన రవీంద్రా ఫిలింస్‌కు కలిగింది మొన్ననే ప్రొజెక్షన్ వేసి చూచుకున్నారు ఓ. కే. అనుకున్నారు శ్రీయుతులు రావుల అంకయ్యగౌడ్, చిత్తూరు ఆనందనాయుడు ఈ రవీంద్రా ఫిలింస్‌కు మూలస్తంభాలు. డైరెక్టర్ ఎవరు అనడిగినందుకు దేవర్‌గారి మాప్పిళ్లై త్యాగరాజన్‌గారే అన్నారు ఆనందనాయుడు ''హీరోగా మూదువంతులు రజనీకాంత్ వుంటారు మార్చి నుంచి సెట్స్‌కు వెళ్లే ఈ చిత్రంలో హీరోయిన్ ఎవర్ని పెడితే బాగుంటుందో ఆలోచిస్తున్నాము నా మిత్రుడు మోహన్‌బాబు కూడా ఈ చిత్రంలో ఒక ముఖ్య పాత్రను ధరిస్తున్నారు'' అని కూడా చెప్పారు ఆనందనాయుడు

రవీంద్రా ఫిలింస్ నిర్మిస్తున్న ''రాముా గెలుపు నీదే!'' వర్ణ చిత్రం లక్ష్మీ ఫిలింస్ ద్వారా విడుదలౌతుంది సీడెడ్‌లో శ్రీశ్రీనివాసా పిక్చర్స్ ఈ చిత్రాన్ని రిలీజ్ చేస్తుంది యాక్షన్, సెంటిమెంట్ సమ్మిళితమైన ఈ చిత్రంలో ''రామూ'' (కుక్క) చేసిన ఫీట్స్ మళ్లీ మళ్లీ చూడాలనిపిస్తుంది. గుర్రం, కుక్క ఒద్దిక ఎన్నిసార్లు చూసినా తనివితీరదు శంకర్ – గణేష్ సంగీతం ''రామూ! గెలుపు నీదే'' చిత్రానికి బాగా హెల్ప్ చేస్తుందని నా నమ్మకం రజనీ, మోహన్ బాబుల కాంబినేషన్‌లో వస్తున్న మొదటిచిత్రం ఇదేనేమో!

రజనీకాంత్, శ్రీప్రియ, జయమాలిని, నాగేష్, రాజన్‌బాబు (బొమ్మరిల్లు ఫేం) మరియు మోహన్‌బాబు ముఖ్యపాత్రలను పోషించిన ఈ చిత్రం త్వరలో ఆంధ్ర ప్రేక్షకులను దర్శించబోతూంది.

'రావణుడే రాముడైతే'లో మోహన్‌బాబు, జయచిత్ర







డి.రామానాయుడు
సమర్పించు
వెంకటేష్ ఎంటర్‌ప్రైజెస్

ఎంకి నాయుడుబావ

సినిమాస్కోప్ ఈస్ట్‌మన్‌కలర్

నిర్మాత: డి.వెంకటేష్ దర్శకత్వం: బోయిన సుబ్బారావు

కథ మాటలు: పినిసెట్టి పాటలు ఆచార్య ఆత్రేయ సంగీతం కె.వి.మహదేవన్

rvkr

ఆంధ్ర-సీడెడ్ నవయుగ నైజాం విజయా సురేష్ పిక్చర్స్


# సినిమా

## జేసుదాస్ క్రొత్త నిబంధన

ప్రముఖ నేపథ్య గాయకుడు శ్రీ జేసుదాస్ ఇటీవల ఒక క్రొత్త ఆంక్షను విధించారట నిర్మాతలకు. మద్రాసులోని అరుణాచలం స్టుడియోలో వున్న రికార్డింగ్ థియేటర్ను నవీన యంత్ర సామగ్రితో ఆధునికం చేసి ఆ థియేటర్‌కు "తరంగిణి" అని పేరు పెట్టి, చిత్రాల్లో తను పాడాలి అంటే ఆ థియేటర్లోనే నిర్మాతలు ఆ, యా చిత్రాల రికార్డింగ్‌లు జరపాలి అంటున్నారట. అన్నది జేసుదాస్ కాబట్టి చెల్లుబడి అయింది, అవుతూంది. మరెవరైనా అంటే?



'ముత్తయిదువ'లో బాలయ్య, జయలక్ష్మి

## ప్రియబాంధవి ప్రెస్‌మీట్

నవంబర్ 26వ తేదీ హోటల్ పామ్‌గ్రూవ్‌లో ఓ చిన్న విందును ఏర్పాటు చేసారు కృష్ణచిత్ర అధిపతులు కృష్ణచిత్ర సంస్థ "ప్రియబాంధవి" అనే ప్రేమానురాగబద్ధమైన చిత్రాన్ని నిర్మిస్తున్నట్లు ఇదివరకే పాఠకులకు తెలిపాను ఆ చిత్రం మొదటి షెడ్యూలు గూడూరు, నరసింహకొండ ప్రాంతాలలో జరిగింది. తర్వాతి షెడ్యూల్ డిశంబర్ 10 నుంచి 30 వరకు శ్రీశైలంలో జరుగుతుంది.

ఆ చిత్ర దర్శక, కథకులు శ్రీ పద్మనాభరావు కథను క్లుప్తంగా యిలా చెప్పారు "ఇది శ్రీశైలంలోని రెండు కుటుంబాల కథ ఆ కుటుంబాల గత చరిత్ర కథనే పోయిన షెడ్యూల్లో గూడూరులో చిత్రీకరించాము చిత్రంలో మొత్తం 6 పాటలుంటాయి"



'శివకేశవులు'లో ప్రభ



'అంతులేని వింతకథ'లో మాధవి

### ఒకసారి పైకితెస్తే జన్మంతా ఋణపడివుంటా !

కొత్తగా సినిమాలో వేషం వేయాలని వచ్చే ప్రతి తార సినిమా మనుషులతో మొట్టమొదట పలికే స్వీట్ డైలాగుల్లో ఒకటిపై చెప్పబడింది. శ్రీమతి రమాప్రభకు సినిమాల్లో నటించాలనే ఆశ పుట్టింది నిర్మాత, కథకుడు అయిన మోహన్ బాబును మంచిచేసుకుంది. రమాప్రభ రూపలావణ్యానికి ముగ్ధుడైన మోహన్‌బాబు ఆమెను మనసారా ప్రేమించాడు. "ఒకసారి పైకితెస్తే జన్మంతా ఋణపడివుంటా" అంటూ మోహన్‌బాబుముద్దేశించి కవితల్లింది రమాప్రభ. "రేయి, పగలు కృషి చేస్తా, ఒక దారి నీకు చూపిస్తా" అంటూ రమాప్రభకు అభయమిచ్చాడు మోహన్‌బాబు కొసరాజు సాహిత్యం, సత్యం సంగీతం, బాలు, వసంతల గాత్రం ఈ మూడింటి సమ్మేళనమే పై రెండు చరణాలు

రమాప్రభ సినిమా మోజు, మోహన్‌బాబు మగువామోహం శ్రీ లలితా ఎంటర్‌ప్రైజస్‌వారి "కోరికలే గుర్రాలయితే ?" వర్ణ చిత్రంలోని హాస్య సన్నివేశాల్లో ఒకటి. శ్రీ జగదీష్‌చంద్రప్రసాద్ నిర్మించిన ఈ చిత్రానికి మాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం శ్రీ దాసరి నారాయణరావు సమకూర్చారు ఈ చిత్రం అన్నపూర్ణా ద్వారా జనవరిలో విడుదల.

## ఇది విన్నారా ?

★ తమిళ చిత్రాలలో ఇక నటించమ అన్న జయసుధ కమల్‌హాసన్‌కు జంటగా ఒక తమిళ చిత్రంలో నటించే సూచనలు కన్పిస్తున్నట్టు వార్త. సినిమాతారలు మాత్రం ఏం చేస్తారు పాపం ! ఆ సమయానికి ఏదో ఒక స్టేట్‌మెంట్ ఇచ్చేస్తారు. ఆతర్వాత మొహమాటాలు, పరిచయాలు ఒత్తిడిచేస్తే నటించక ఏంచేస్తారు !

★ చాలాకాలం తర్వాత జయలలిత ఒక అరవ చిత్రంలో నటించడానికి అంగీకరించినట్టు తెలుస్తోంది. మరి తెలుగులో కూడా నటించడానికి ఒప్పుకుంటుందో ! లేదో ముమ్ముందు తెలియాలి ప్రస్తుతం విదేశ పర్యటనకు నిర్ణయించిన జయలలిత డిశంబర్ 30 వరకు అమెరికా, ఫ్రాన్స్ మున్నగు దేశాల్లో విహారయాత్ర చేస్తుందని తెల్సింది

★ తమిళ దేశంలోని చలనచిత్ర పరిశ్రమకొక కొత్త ఫార్ములా కనిపెట్టాడు యన్. కె. రామలింగం అనే ఫిలిం ఇన్‌స్టిట్యూట్ ఆపరేటర్. దాని పేరు "సేవా స్కోప్" ఒక ప్రింటు తీయడానికి ప్రస్తుతం 14 రోల్స్ (పాజిటివ్) వాడుతున్నారు. "సేవా స్కోప్"లో అయితే 7 రోల్స్‌తోనే ప్రింటు తీయవచ్చు అని రామలింగం చెప్పారు. 1964 లో మొదలుపెట్టిన అతని ప్రయత్నం 1978 లో కార్యరూపం దాల్చింది. కేంద్ర ప్రభుత్వం గుర్తింపు వచ్చింది. మన తెలుగు చిత్ర నిర్మాతలు కూడా త్వరలో ఆ విధానానికి పూనుకుంటారేమో !

### చిత్రాలకు స్వస్తిచెప్పిన గ్లామర్ నటి

గ్రేస్ వున్న గ్లామరు నటిగా ప్రేక్షకులను సమ్మోహపరిచిన మంజుల దైవసంకల్ప ఫలితంగా శ్రీమతి మంజులావిజయకుమార్‌గా సలక్షణ జీవితాన్ని అనుభవిస్తున్నది.

"తుఫాన్ మెయిల్" చిత్రం తరువాత ... సినిమారంగానికి స్వస్తిచెప్పినట్టు ఆమె చెప్పింది

— శ్రీనివాస్




పూర్ణోదయా ఆర్ట్ క్రియేషన్స్

తాయారమ్మ బంగారయ్య

(వర్ణచిత్రం)

నిర్మాతలు:
ఏడిద నాగేశ్వరరావు. ఆకాశం శ్రీరాములు. దర్శకత్వం కొమ్మినేని

# జి. వి. జి. పేజీ



'అమ్మాయి కావాలి'లో సుభాషిణి

## ఒకే రోజున నాలుగు చిత్రాల ప్రారంభోత్సవాలు

డిసెంబర్ 9న మద్రాసులో మూడు చిత్రాలకు తొలి పాటల రికార్డింగ్‌లు, ఒక చిత్రానికి షూటింగ్ ప్రారంభోత్సవం జరిగాయి నాటిలో రెండిటిలో శోభన్‌బాబు హీరో 1. దీపక్ దర్శకత్వంలో డాక్టర్ ప్రభాకరరెడ్డి రాసిన కథ ఆధారంగా కవితా ఫిలింస్ నిర్మించే వర్ణ చిత్రంలో శోభన్‌బాబుతో శారద, శ్రీదేవి, రాజ్‌బాబు, అల్లు రామలింగయ్య, రమాప్రభ ప్రభృతులున్నారు 9న సత్యం సంగీత దర్శకత్వంలో తొలి పాట రికార్డింగ్ జరుపుకొన్న అనంతరం 11న వాహినీలో షూటింగ్ ప్రారంభమైంది 2. బోయిన సుబ్బారావు దర్శకత్వంలో టి త్రివిక్రమరావు నిర్మించే విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ వర్ణ చిత్రంలో శోభన్‌బాబుతో జయసుధ, మురళీమోహన్, శ్రీదేవి, జయమాలిని, మాడా నటిస్తారు మహదేవన్ స్వరకల్పనలో ఆత్రేయ గీతం ధ్వనిముద్రిక చేయబడింది డిసెంబర్ 17న ఊటీలో షూటింగ్ ప్రారంభం.

దాసరి కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం నిర్వహిస్తూ, విశిష్టమైన ముఖ్య భూమిక నిర్వహించే శ్రీ లక్ష్మీనరసింహ ఇంటర్నేషనల్ సంపూర్ణ హాస్య వర్ణచిత్రం "పెద్దిల్లు–చిన్నిల్లు" షూటింగ్ జైపూర్ పేలెస్‌లో ప్రారంభమైంది చి॥ తారక హరిహరప్రభు కెమెరాకు చలనం కలిగించగా, డైరెక్టర్ కె. బాలచందర్ "మురుగా!" అంటూ తొలి క్లాప్ కొట్టారు ఎం. కె. మావుళ్ళయ్య నిర్మించే చిత్రమిది ఈ చిత్ర కథను టూకీగా వివరిస్తూ, తను దర్శకత్వం వహించే మరికొన్ని చిత్ర విశేషాలను తెలియజేశారు దాసరి... వడ్డే రమేష్ నిర్మించే విజయమాధవి పిక్చర్స్ "రంగూన్ రౌడీ" వర్ణ చిత్రంలో కృష్ణంరాజు హీరో. తిరుపతి పిక్చర్స్ పతాకంలో హీరో జితేంద్ర హిందీలో నిర్మించే "కటకటాల రుద్రయ్య"కు స్క్రిప్టు పని జరుగుతోంది "రంగులరాట్నం" చిత్రాన్ని కూడా విజయావారు హిందీలో తీయ సంకల్పించారు

దాసరి దర్శకత్వంలో శోభన్‌బాబు రెండు చిత్రాలలో హీరో. 1 "సిరిపురంలో ఓ చిన్నోడు" 2. కె నరసింహంనాయుడు నిర్మాతగా కె మురారి సమర్పించే యువ చిత్రవారి ద్వితీయ చిత్రం

"చిలక పలికిందిరో" అనే వేటూరి గీతం రాజశేఖర్ ప్రొడక్షన్స్ పతాకంలో కె. తులసీదేవి నిర్మించే చిత్రానికి జె వి. రాఘవులు స్వరకల్పనలో ఆ రోజే జెమినీలో రికార్డు చేయబడింది. రామకృష్ణ, జగ్గయ్య, అల్లు రామలింగయ్య, కాంచన, విజయలలిత, బేబీరోహిణి, మరికొందరు కొత్త తారలు పాల్గొంటారు జి. బంగారురాజ దర్శకుడు బొల్లిముంత శివరామకృష్ణ సంభాషణలకర్త ఆత్రేయ కూడా కొన్ని పాటలు రాస్తారు. నెల్లూరు పరిసర ప్రాంతాలలో షూటింగ్ జరుగుతుంది హరనాథ్ ఛాయాగ్రాహకుడు.



'ఎంకి – నాయుడుబావ'లో ఒక దృశ్యం



అవార్డుల చిత్రం 'ఒక వూరి కథ'లో మమతాశంకర్

## కరుణామయుడులో పుణ్యపురుషుని పునరాగమనం

మతోన్మాదుల శిలువకు బలియైన దైవకుమారుడు మూడోనాడు పునర్జీవితుడై, సదేహంతో లేచివచ్చాడు. స్వప్నమా – సత్యమా అన్న సందిగ్ధంలో పడ్డారాయన శిష్యులు.

"ఎందుకింకా మీరు సందేహిస్తున్నారు? నేనేం దెయ్యాన్నికాదు. నేను నేనే. నా తండ్రి చిత్తమిలా జరుగవలసియున్నది గనుక జరుగక తప్పదు," అన్నాడు క్రీస్తు.

సకల మానవాళికీ అప్పుడే కరుణామయుడు శాశ్వతంగా అన్ని కాలాలకూ ఉపయోగపడే సమాధానమిచ్చాడు: "చూచి నమ్మినవారికంటే చూడక నమ్మినవారే ధన్యులు" ఇందులోనే సమస్త ధర్మసూక్షం వుంది

విజయచందర్ ప్రధాన పాత్ర ధరిస్తూ, రసవత్తరంగా నిర్మించిన రాధా చిత్ర వారి "కరుణామయుడు" వర్ణ చిత్రం ఎం ఎస్ కుమార్ సమర్పణ

## పినిశెట్టి షష్ట్యబ్దపూర్తి

సాహితీ ప్రవక్త పినిశెట్టి శ్రీరామమూర్తి సన్మాన మహోత్సవం డిసెంబర్ 10 సాయంత్రం మద్రాసు ఫిలిం ప్రొడ్యూసర్స్ కౌన్సిల్ ఆవరణలో వైభవోపేతంగా జరిగింది రాష్ట్ర గ్రామీణాభివృద్ధి శాఖామాత్యులు శ్రీ పరకాల శేషావతారం అధ్యక్షత వహించారు సన్మానితుని ప్రతిభా విశేషాల గురించి ప్రముఖులు ప్రస్తుతించారు. ఆనాడే సి రాజగోపాలాచారి, తమిళ అమరకవి భారతిగార్ల జన్మదినమవడం మరో విశేషం

బాలాజీ ఇంటర్ నేషనల్ సమర్పించు

A

# ఆడదంటే అలుసా?



రంగుల హరివిల్లు

దర్శకత్వం: ఎమ్. మల్లిఖార్జునరావు నిర్మాత: జి. బాబూరావు

రచన: త్రిపురనేని మహారధి కెమెరా: లక్ష్మణ్ గోరే సంగీతం: జె రాఘవులు కూర్పు: కోటగిరి గోపాలరావు

# జి. వి. జి. పేజీ



'ప్రెసిడెంట్ పేరమ్మ'లో కవిత, రాజబాబు

## సృష్టి రహస్యాలు

''డిసెంబర్ 17 నుంచి కాకినాడ, ఆ తర్వాత విజయవాడలో పూర్తిగా ఔట్‌డోర్‌లో షూట్ చేస్తున్నాం,'' అని తెలియజేశారు శ్రీ వెంకటసాయి పిక్చర్స్ ''సృష్టిరహస్యాలు'' తొలి తెలుగు సైన్స్ ఫిక్షన్‌కు దర్శకత్వం నెఱవుతున్న ప్రతాప్. ఈయన లోగడ స్వర్గీయ ఆదుర్తి, కె. బి తిలక్, బి. ఎస్ నారాయణగార్ల వద్ద సహకార దర్శకుడుగా అనుభవం గడించారు ''దాంపత్య జీవితం గురించి నూతన దంపతులకు కలిగే అపోహలు, సుఖప్రదమైన రీతిలో కుటుంబ నియంత్రణం, అనాదిగా కొందరిలో పేరుకుపోయి వున్న మూఢనమ్మకాలు, పెక్కు లైంగిక సమస్యలు, ఇత్యాదులతో చక్కని సంఘటనలను మిళితంచేసి ఈ చిత్రాన్ని సమర్పించే నవలా రచయిత డాక్టర్ కొమ్మూరి వేణుగోపాలరావు రసవత్తరమైన కథను తయారుచేశారు,'' అన్నారు ప్రతాప్ డిసెంబర్ 6 న శారదా స్టూడియోలో పెండ్యాల బాణీలో జానకి పాడిన ''ఈ వీణ నా ప్రాణమే'' అనే శ్రీ శ్రీ గీతం రికార్డు చేయబడింది జగ్గయ్య, సుధాకర్, రవికాంత్, అర్జున్, మమత, అంజలీనాయుడు (బొంబాయి), విజయలక్ష్మి, సి. హెచ్ లక్ష్మి, మద్దాలి సుశీల నటవర్గం వి. వి రావ్‌చౌదరి, లీలాకృష్ణ, వెంకటేశ్వరరావు, సింగ్, జి టి. ప్రసాద్, జయంత్‌బాబు — ఛాయ, శిల్పం, కూర్పు, సహకార దర్శకత్వం, ప్రొడక్షన్ బాధ్యతలు వహిస్తున్నారు. కె. రాంబాబు నిర్మాత

## మహాలక్ష్మి పెళ్ళి

''డిసెంబర్ 24 న సి నారాయణరెడ్డి గీతం రాజేశ్వరరావు సంగీతంలో రికార్డు చేయబడుతుంది. జనవరి 26 న హైదరాబాద్‌లో షూటింగ్ ప్రారంభం,'' అని తెలియజేశారు డైరెక్టర్ పేకేటి శివరామ్ ఆయన రాసిన ''మహాలక్ష్మి పెళ్ళి'' అనే విశిష్టమైన కథను ఖాదర్‌భాషా తెరకెక్కిస్తున్నారు. పరుచూరి సంభాషణలకర్త. ఛాయ, కూర్పు శాఖలను మధుసూదన్, కె. వెంకటేశ్వరరావు నిర్వహిస్తారు.

## కరాటే కమల

కొమ్మినేని శేషగిరిరావు దర్శకత్వంలో ''కరాటే కమల'' తమిళ చిత్రం విజయవంతంగా ప్రదర్శింపబడుతోంది అదే చిత్రాన్ని సినీ మేకప్ మూవీస్ వారు తెలుగులో కపిల నాగేశ్వరరావు నిర్మాణ నిర్వహణలో తయారు చేశారు జయమాలిని, అపర్ణ, హలం, మనోహర్, అశోకన్ నటించారు శంకర్‌గణేశ్ సంగీత దర్శకులు దేవరాజ్ ఛాయాగ్రాహకుడు



'ఇది కథకాదు'లో చిరంజీవి, జయసుధ

## పట్నంపిలలో
## తమ పేర్లే గల పాత్రలలో నటులు

స్టేషన్ మాస్టర్ మురళి(మోహన్) సైకిల్ మీద స్టేషన్‌కు వెళ్తూండగా అడ్డుగా ఒక సైకిల్ వచ్చి నిలచింది ఆ సైకిల్‌మీదున్న మోహన్(బాబు) విలాసంగా చూస్తూ, "మీరేనా ఈ ఊరికి కొత్తగా వచ్చిన స్టేషన్ మాస్టర్ ? ఈ ఊళ్ళో అందరూ నన్ను మైనర్ మోహన్ అని ముద్దుగా అంటార్లెండి ఈ ఊళ్ళో మీకే అవసరంవచ్చినా—నాపేరు చెప్పండిచాలు," అన్నాడు

"అహా! అంతగా అవసరం రాదులెండి," అన్నాడు మురళి ముఖం చిట్లిస్తూ.

"మాస్టారూ ! వారానికి నాలుగైదురోజులు నేను పట్నానికి వెళ్తూంటాను ఒక ఐదునిమిషాలు నేను రావడం ఆలస్యమైనా బండి ఆపుచేయించండి ఇంతకుముందున్న స్టేషన్ మాస్టర్లు అట్లాగే చేసేవారు ఎంతైనా పల్లెటూరేగా ?"

"ఏమయింది నే వస్తాను," అంటూ మురళి సైకిల్‌మీద ముందుకు సాగాడు

కె సత్యం దర్శకత్వంలో శారదా స్టూడియోలో పై చిత్రీకరణ జరిగిన ఉమాదేవీ పిక్చర్స్ "పట్నంపిల్ల" రంగుల చిత్రంలో కమలహాసన్, శ్రీదేవి, సత్యప్రియ, త్యాగరాజు, సారధి, మేడిశెట్టి, అనిత, పి ఆర్ వరలక్ష్మి, జయమాని ఇతర పాత్రధారులు కె తాతాజీ నిర్మాత సంగీతం, ఛాయ, సహకార దర్శకత్వాన్ని చక్రవర్తి, పి సాయిప్రసాద్, కె సత్యనారాయణ నిర్వహిస్తున్నారు



'కోరికలే గుర్రాలైతే'లో
జయలక్ష్మి, మురళీమోహన్, ప్రభ

## పరాజిత

విద్యావిశారద మద్దినేని రాధాకృష్ణమూర్తి రాసిన (అక్కినేని నాగేశ్వరరావు లిటరరీ అవార్డ్ పొందిన) "పరాజిత" నాటకాన్ని ఆయన చిత్రానువాదం, సంభాషణలతో పి సుబ్రహ్మణ్యం దర్శకత్వంలో నాగరత్న ఆర్ట్ పిక్చర్స్ అధినేతలు మద్దినేని తాతయ్య, జంపని హనుమంతరావు తెర కెక్కిస్తున్నారు జయంతి, ప్రభాకరరెడ్డి, నారాయణరావు, ప్రసాద్‌బాబు, ఎం. పి. ప్రసాద్, రాళ్ళపల్లి, మల్లాది శివ, మాస్టర్ పురుషోత్తం, జానకి ముఖ్యపాత్రలు పోషిస్తారు. సముద్రాల గీతాలకు చక్రవర్తి బాణీలు కూర్చుతారు. రాజా ఛాయాగ్రాహకుడు. కె వి ఆంజనేయులు సహదర్శకుడు. ఫిబ్రవరి మూడవవారం నుంచి మార్చి 15 వరకు చిలకలూరిపేట పరిసర ప్రాంతాలలో షూటింగ్ జరిగే ఈ చిత్రానికి జనవరి 15, 16 తేదీల్లో పాటలు రికార్డ్ చేయబడతాయి.

## "లేడీ అసిస్టెంటు వద్దు బాబోయ్ !"

డాన్స్ డైరెక్టర్ రాము వద్ద అసిస్టెంట్‌గా ఓ యువకుడు పని చేస్తూండడం చూసి, "లేడీ అసిస్టెంట్ మళ్ళీ ఎవరూ దొరకలేదా ?" అని అడిగాను. "వద్దు, బాబోయ్! నా దగ్గర పని చేస్తూ వచ్చిన సీమ 'అంగడిబొమ్మ' చిత్రం తర్వాత బిజీ స్టార్ అయిపోయింది మరో అమ్మాయిని ఆ స్థానంలో నియమించుకుంటే, ఆమె కూడా ఎక్కడ స్టార్ అయి దూరమై పోతుందో అని భయం అందుకని ఈ యువకుణ్ణి అసిస్టెంట్‌గా వేసుకున్నా" అన్నాడు రాము లోగడ చోప్రా దగ్గర అసిస్టెంట్‌గా పనిచేశాడు

## తొలి ముదిమి — ద్వితీయ యవ్వనం !

"హమారే తుమారే, జానీ దుష్మన్" చిత్రాల అనంతరం వృద్ధ పాత్రలను ఒప్పుకోవడంలేదని సంజీవ్‌కుమార్ ప్రకటిస్తే, "ఇంకా యువ హీరో పాత్రలనే ధరించడం ఇటీవల నాకదో ఇదిగా ఉంది. మంచి పాత్ర అయితే, ఓల్డ్ అయినా వేస్తాను" అని ప్రకటించాడు దేవానంద్.





## సైకిల్ బ్రాండ్ అగరబత్తి పోటి

### విజేతలు!

ఈ పోటీలో పాల్గొని పూర్తి సహకారము అందించిన వారందరికి, 'వాసు' మరియు 'సైకిల్' బ్రాండ్ అగరబత్తి ఉత్పత్తిదారులైన ఎన్. రంగరావు & సన్స్ ధన్యవాదాలు తెలియజేస్తున్నారు. తెలుగు ఎంట్రీల బహుమతి విజేతులందరికీ వారు అభినందనలు అర్పిస్తున్నారు తెలుగు ఎంట్రీలను పరిశీలించి నిర్ణయించినవారు శ్రీ కె. కుటుంబరావు, ఎడిటర్, చందమామ. విశేష బహుమతులు పొందినవారితో సహా విజేతులందరికీ పోష్టుద్వారా తెలియజేయబడును.

1 ప్రథమ బహుమతి : పి. శ్రీదేవి, హైదరాబాదు.

3 ద్వితీయ బహుమతులు : బి. సీత, విజయనగరం; జి. నిర్మల, నెల్లూరు; ఆర్. సీతారాం, మెదక్.

10 తృతీయ బహుమతులు : కే. శేషగిరిరావు, ఒంగోలు; పి. సుబ్రహ్మణ్యకుమారి, నెల్లూరు; వల్లూరిమంగ, బాపట్ల; జి. స్వర్ణలత, కురిచేడు; కె. కన్నయ్య, కారిచేడు; పి. జ్యోత్స్నకుమారి, ఏలూరు; ఎస్. కొండయ్య, అనంతపురం; ఎస్. కె. మరువాడ, శ్రీకాకుళం; ఏ. వై. ఎల్ ఎన్. మూర్తి, హైదరాబాదు, పి. వి. పండరీరాం, ఏలూరు.

CycleBrand SUGHANDHA MALLIKA AGARBATHI
N. RANGARAO & SONS P. B. NO. 52 MYSORE 4 INDIA
NR VASU SPECIAL OODA BATHI

మనోహరమైన సువాసనలు శ్రేష్ఠమైన బత్తీలు వివిధ రకములలో క్వాలిటీ సైకిల్ బ్రాండ్ గుర్తుకై చూడండి.

MCA NR 54 Tel


'మానాని మంచితనం'లో వాణిశ్రీ


దాసరి నారాయణరావు

శ్రీలలితా ఎంటర్‌ప్రైజెస్

# కోరికలే గుర్రాలయితే?

కలర్

నిర్మాత: జి. జగదీశ్‌చంద్ర ప్రసాద్ B.A.

అన్నపూర్ణ

# "నా కుటుంబానికి తగిన సంపూర్ణ ఆరోగ్య పానీయం"

## ఒక్క కాంప్లాన్

**మాత్రమే శరీరానికి కావలసిన 23 అతి ముఖ్యమైన ఆహారాలను సంపూర్ణంగా కలిగి ఉంది.**




ఒక్క కాంప్లాన్ లోనే, బలం, శక్తికోసం ప్రతి రోజూ శరీరానికి కావలసిన ప్రొటీనులు, కార్బోహైడ్రేట్‌లు, ఖనిజ లవణాలు, విటమినులు, ఇతర ముఖ్యమైన ఆహారాలు శాస్త్రీయంగా కూర్చబడిన పాళ్లలో ఉన్నాయి.

గుర్తుంచు కోండి, సంపూర్ణ పోషణ కోసం డాక్టర్లు కాంప్లాన్‌నే ఎక్కువగా సిఫార్సు చేస్తున్నారు.

కాంప్లాన్ సాధారణ రుచిలోనూ, చాకలెట్, ఏలకికాయ-కుంకుమపువ్వు, పిల్లలు ఇష్టపడే స్ట్రాబెర్రీ వంటి కమ్మని రుచుల్లోనూ కూడా లభిస్తుంది!

# సంపూర్ణమైనది

**కాంప్లాన్** సంపూర్ణ ఆరోగ్య పానీయం

CASGC.38-234 TEL

నానా వార్తలకు, ప్రత్యేక శీర్షికలకు, వైవిధ్యంగల వ్యాసాలకు
ఆంధ్రపత్రిక దినపత్రిక చదవండి.




# నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత, కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకోండి. కోల్గేట్, ప్రపంచమంతటా దంత వైద్యులు సిఫారసు చేసి తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయె ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన, ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోమకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు, దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పనిచేస్తుందంటే:





మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.

కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుగ చేరి హానికరమైన ఆహారపు అణువులను బాక్టీరియాను తొలగిస్తుంది.

ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

హాయినిగొల్పే, తాజా శ్వాసకోసం, పళ్ళను తెల్లగా రూపొందించేందుకు ప్రపంచంలో ఎక్కువ మంది, మరే ఇతర టూత్‌పేస్ట్ కన్న ఎక్కువగా కోల్గేట్‌నే కొంటూ ఉంటారు!






ఒక్క దంతవైద్యులు మాత్రమే దీనికన్న మేలైన దంతరక్షణ సమకూర్చగలరు.


# గవర్నెస్ కరుణ

(18వ పేజీ తరువాయి)

చేతులు వేసుకుని డాలీ నిద్ర పోయింది.

మర్నాడు చాలా పొద్దుపోయినా డూప్లే లేవలేదు. అతని గదిలోనే అటాచ్‌డ్ బాత్ వుంది కనుక కాలకృత్యాలు జరిగిపోయి వుంటాయి! గణేష్ అతనికి కావలసినవి అందిస్తున్నాడు. తనకి యిచ్చిన జీతంలో కరుణ లైబ్రరీ నుంచి పుస్తకాలు తెప్పించుకుంది. మధ్యాహ్నం పోస్ట్‌లో పుస్తకాలు వచ్చాయి. డూప్లే లేవలేదు లేచినా బయటికి రాలేదు.

డూప్లే వయసు యిదమిద్ధంగా చెప్పలేము. ఎందుకంటే అతను చిన్నతనం ఏ విధంగా గడిపాడో తెలియదు కానీ వ్యాయామంచేసి కండలు తిరిగిన అతని బలిష్ఠమైన శరీరం చూస్తే ముప్ఫై ఏళ్ళుంటాయేమో అనుకుంటారు డాలీకి పదేళ్ళున్నా చిన్న పిల్లల తత్వం యింకా పోలేదు

* * *

చూస్తుండగానే వధి విరామం లేని సమయం రోజుల్ని ఏళ్ళనీ దొర్లించేస్తోంది. కర్తవ్యం తప్ప యింకేమీ తెలియడం లేదు. కాలం జరగనట్టూ, వచ్చినట్లు బ్రతకాల్సి వస్తున్నట్లుగానూ వుంది. కరుణకి ఈ మధ్య ఏకాంతం మరీ కనిపిస్తోంది. డాలీ పెద్దదౌతోంది. పెరుగుతున్న డాలికి యిప్పుడిప్పుడే మంచి - చెడలు తెలుస్తున్నాయి. కరుణ సురక్షణలో నారు పోసుకున్న ఆ చిన్ని మొక్క పెరిగి పెద్దదై పూలు పూస్తూ, ప్రేమానురాగాలతో పాటు ... పోతోంది.

పొద్దున్నే లేవగానే కాలకృత్యాలు తీర్చుకుని కరుణ రెండు జడలు వేయగానే యూనిఫామ్‌లో తండ్రి గదిలోకి తొంగి చూసి 'గుడ్ మార్నింగ్ డాడీ' అంటుంది రాత్రి నిద్ర పోయేముందు తిరిగి తండ్రి గదిలోకి వచ్చి 'గుడ్‌నైట్ డాడీ' అంటుంది

'యస్ గుడ్ మార్నింగ్ ఆనో, గుడ్ నైట్ అనో' సందర్భానికి తగినట్టుగా జవాబు చెబుతాడు డూప్లే నాలుగేళ్ళ క్రితం ఓసారి డాలీ కరుణని పెనవేసుకు పడుకున్నప్పుడు అన్నాడు: 'ఆమె మన





# మీ పిల్లలకు ఆహారం
# పుష్టికరమైన ఆహారం
# మీ పైరుకు ఆహారం
# విజయ్

పిల్లలాగానే పైర్లు కూడా ఏపుగా పెరగాలంటే పుష్టికరమైన ఆహారం ఇవ్వాలి. అందుకై నత్రజని, భాస్వరం, పోటాష్‌లను అవసరమైనంతగా పైర్లకు వేయాలి. విజయ్ కాంప్లెక్స్ ఎరువుల్లో ఈ మూడు ముఖ్య పోషక పదార్థాలు సరియైన పాళ్ళలో వున్నాయి.

మీ భూముల, పంటల అవసరాన్ని గుర్తించి తయారు చేసిన కాంప్లెక్స్ ఎరువులే విజయ్ 17-17-17, విజయ్ 14-28-14, విజయ్ 24-24-0.

ఆసియాలో పెద్దది, ఆధునాతనమైనది అయిన మద్రాస్ ఫర్టిలైజర్స్ వారి కర్మాగారంలో విజయ్ ఎరువులు మీకై తయారుచేయబడుతున్నాయి.

విజయ్ ఎరువులనుగురించి ఇంకా వివరాలకు ఈ క్రింది వారిని సంప్రదించండి.

ఏరియా మేనేజర్
మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్
14, శాంతి నగర్ కాలనీ, హైదరాబాదు-500 028






గవర్నెస్ నువ్వలా కౌగలించుకుని పడుకో వద్దు.'

ఆవేళ నుంచి డాలీ గది వేరే అయి పోయింది. మధ్య రాత్రి భయంతో దయ్యాలూ భూతాలూ పీకలమీద కూర్చున్నట్టు అనిపించగానే డాలీ కెవ్వున కేక పెట్టేది. చావు బతుకుల మధ్య పెనుగులాడుతూ వేసిన ఆ కేక హృదయవిదారకంగా వుండేది. కరుణ తలుపులు భళున తెరుచుకుని డాలీ దగ్గరకి పరుగు పెట్టేది. డాలీ రెండు చేతుల మధ్యా మొహాన్ని దాచుకుని భయంతో వొణికిపోతూ ఏడుస్తూండేది. 'నేనున్నాను డాలీ ఏడవకు' అని కరుణ దగ్గరకి తీసుకోగానే డాలీ బిక్క మొహం వేసేది. ఆ పిల్ల పడుకోగానే దర్శన్‌కి అక్కడే పక్క పరిచి వెళ్ళిపోయేది.

కోపం పట్టలేక 'మా నాన్న డాక్టర్ భారవ' అని చెప్పాలనుకునేది.

'అనువుగాని చోట...' పద్యం జ్ఞాపకం రాగానే నోరు మూతపడి పోయేది.

'పార్టీకి నాతో వచ్చేందుకు నీకేమైనా అభ్యంతరమా కరుణా' అని అడిగాడు డూప్లే.

కరుణ కళ్ళు రెండూ పైకెత్తి 'నేనా' అంది.

'ఆఁ' అతను రెండుచేతులూ తమాషాగా తిప్పాడు. 'సరే' అని వెళ్ళిపోయింది కరుణ.

ఆ తరువాత ఎన్నోసార్లు అతనితో పార్టీలకి అటెండ్ అయేది. పార్టీలకి వెళ్ళేప్పుడు



## నువ్వూ - నేనూ

భారి వృక్షం లాంటి
భారీ భవనం పై నువ్వు..
పసిడి మొక్కలాంటి
పాకలో నూకలు లేక నేను.
రోజొక తాజా రోజాతో
మోజులు తీర్చుకొంటూ నువ్వు..
గాజులా చిట్లిన కడుపులో
ఆకలి బీజాల్ని నాటుకొని నేను..
దౌర్జన్యం నీ ధ్యేయం
దోపిడితనం దాని భావం.
చైతన్యం నా ధ్యేయం
చెలరేగడం దీని భావం.
ధ్యేయాల మధ్య ద్వేషం రగిలితే
భావాల నడుమ...
బద్ధ విరోధం చెలరేగితే.
నా పాక ప్రక్కన
పీకలు తెగి నువ్వు.
నీ భవనం మీద
బాధలు మరచి నేను..

– వీరపనేని వీణావాణి



## గవర్నెస్ కరుణ

చాలా హుందాగా తయారయే కరుణకి ఏం కావాలో చూసి బట్టలూ, ఆర్టిఫిషల్ నగలూ కొనిచ్చాడు డూప్లే.




ఆర్టిఫిషల్ నగలు చూసి కరుణ నవ్వి అతనికి తిప్పి పంపేసింది.

'యివి దేనికి తిరిగి పంపావు?' అని అడిగాడు డూప్లే.

కరుణ మరోసారి నవ్వి 'యిలాంటివి పెట్టుకొనే అలవాటు లేక' అని జవాబు చెప్పింది. ఆ తరువాత మంచి చీరలు కట్టుకుని నగలేమీ పెట్టుకోకుండా వెళ్ళేది కరుణ. యిందుకు డూప్లే ఏమీ అనేవాడు కాదు.

ఆ రాత్రి మాటుంగలో డాక్టర్ గిరి యింటో పార్టీ జరిగింది. డూప్లే పిల్లతో, కరుణతో వెళ్ళాడు.

మాటల మధ్య డూప్లేని చాలా మంది అభినందించారు 'నిజంగా మీ గవర్నెస్ పై మనిషి అంటే ఎవరూ నమ్మరు డూప్లే బహుశా మీ మేనత్త కూతురో, మేనమామ కూతురో అయి వుంటుంది.'

డూప్లే ఈ రిమార్కుని లెఖ్ఖ చేయలేదు తనని కానట్టు ఆ మాట ఏమీ విననట్టు వూరుకున్నాడు.

'ఆమె కళ్ళు కూడా నీ కళ్ళ మాదిరే నీలంగా వున్నాయి చాలా అందంగా వుంది.'

డూప్లే ఫోర్కుతో శాండ్ విచస్ తినడంలో మునిగి పోయాడు. పార్టీలో అందరి కళ్ళూ కరుణ మీదే వున్నాయి. డూప్లే అదృష్టం చాలా మందికి ఈర్ష్యని కలిగిస్తోంది. ఎంటిక్స్‌కి బాటిల్స్ ఖాళీ అవుతున్నాయి. పార్టీ ముగిసి యింటికి వచ్చేసరికి పన్నెండు గంటలైంది. దర్శన్ అంత వరకూ చూసి చూసి పడుకుంది. గణేశ్ వీధి గేటులో కుర్చీలో కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు. కారు హారన్ వినగానే బెత్తంతో మొహంమీద కొట్టినట్టు అయింది. అతను లేచి గేటు తెరిచి సెల్యూట్ చేశాడు. డాలీ నిద్ర పోయింది. నిద్ర పోయిన డాలీని తీసుకు రమ్మంది కరుణ. డూప్లే కొద్దిగా తూలుతున్నాడు.

గణేశ్ పిల్లని భుజాన వేసుకుంటూ అన్నాడు: 'సుధాకర్ సాబ్ వచ్చారు'

డూప్లే తల తిప్పి శ్రద్ధగా విని 'ఏఁ?' అని అడిగాడు.

'భోజనం చేసి పడుకున్నారు.'

'ఎప్పుడు వచ్చాడుట?'

'మధ్యాహ్నం రెండు గంటలకి వచ్చారుట. పనులు ముగించుకుని యిక్కడికి

# చూడండి...
# సర్వోత్తమ తెలుపుకోసం రానిపాల్®







బట్టలను ఆఖరిసారి జాడించునపుడు కొంచెము రానిపాల్ వేయండి. అపుడు చూడండి...
బట్టలపై మెరిసే తెలుపు! రానిపాల్ తెలుపు! తెల్లటి బట్టలు ఏవైనా కాని....
నూలు, సింథెటిక్ మరియు మిశ్రమ బట్టలు రానిపాల్‌తో మెరుస్తూ వుంటాయి.

**నియమానుసారంగా రానిపాల్‌ను వేయండి...తెలుపు చూడండి. చూపండి!**

**నూలు దుస్తులకు రానిపాల్®**

**సింథెటిక్ మరియు మిశ్రమ దుస్తులకు రానిపాల్® ఎస్.**

Shilpi SG-2A/78 Tel

వచ్చేసరికి చాలా ఆలస్యం అయిందని అన్నారు. బహుశా సాయంత్రం ఏడు గంటలు అయి వుండవచ్చును.'

'పడుకున్నాడా?'

'అవును సాబ్. మీరు వస్తే లేప మన్నారు.'

'లేవు' అని చూస్తే కారు గారేజ్‌లో పెట్టాడు. కరుణ తన గదిలోకి వెళ్ళి పోయింది.

(ఇంకా వుంది)


# బ్రిటానియా పాల బిస్కట్



**పెరిగే పాపాయిలకు రుచివంతమైన తోడు!**




**రుచికరమైన, పుష్టికరమైన**
**బ్రిటానియా గ్లాక్సో మిల్క్ బికీస్**

లింటాస్-BBC.GLXMB.2-203 TE

**వివ్. ఆర్. ఆర్. — సికింద్రాబాదు.**

లేని గొప్పలు పోయి. సర్దుకోలేని వాళ్ళని ఏం అనాలి?

★ పాపం, ఏమీ అనకూడదు. గొప్పతనానికి ప్రయత్నిస్తే ఇక వెనక్కి చూడకూడదు స్థయిర్యం సడలుతుంది.

**వెంకట్ — ఉరవకొండ**

సంస్కృతి, నాగరికత ఈ రెంటికీ తల తేడా ఏమిటి?

★ నేను పబ్లిక్ పరీక్ష రాయడానికి ముందు కూడ యింత భయపడలేదయ్యా వెంకట్. సంస్కృతి తరతరాల మన పెంపు నాగరికత ఆ పెంపు తాలూకు వర్తమానపు వెలుగు. (బోసి పెద్ద పెద్ద పుస్తకాలు చూసి రాద్దామా అనుకున్నాను-వున్న మతి కాస్తా పోతుందని భయం వేసింది!) సంస్కృతి జాతికి శాశ్వతం, నాగరికత తాత్కాలికం. అంతే నాకు తెలుసు! క్షమించు.

**సి. హెచ్. వి. ఆర్. — కల్లూరు**

మగవాడు ఆడపిల్లని ప్రేమించి వదిలిపెడితే అన్యాయం చేశాడంటారు. ఆడపిల్ల ప్రేమించి వదిలిపెడితే-ఎవరూ ఏమీ అనరు.

★ సమానత్వం వుంది కదా — అనాలి-మోసపోయాడని!

**వి. పి. కె — పెద్దపల్లి**

మీ జవాబులవల్ల ఆడామగా మధ్య సఖ్యత కుదరక పోగా కలతలు యింకా ఎక్కువగా రేగుతున్నవి.

★ సఖ్యత చావకొట్టి చెవులుమూసినా, చచ్చినట్టు ఏర్పడుతుంది. అదికాదు కావలసిన సఖ్యత. మనిషి మీద మనిషికి వుండే గౌరవంతో కూడిన సఖ్యత-కావలసినది. అది అవగాహన వల్ల ఏర్పడేది ఒకరి మాట యింకొకరు వినేయడం వల్లకాదు.

**జి. ఎమ్. — సికింద్రాబాదు**

జీతం చాలక చస్తుంటే పొదుపు అంటారేమిటి? అన్యాయం కదా.

★ కాదు మూర్తి గారూ. పొదుపు పేదవాడి ఐశ్వర్యం. గొప్పవాడి తెలివి. అంటేఇద్దరికీ అవసరమే.

**పి. ఎస్. బి. — హైద్రాబాదు**

విశ్వవిద్యాలయం అంటే ఏమిటో అందునా భారతదేశంలో ఉత్తమోత్తమమైన విశ్వవిద్యాలయం అది. ఆ సంగతి తెల్సామీకు? మనస్సులో మీకివ్వలేదన్న కక్ష అక్కసు పెట్టుకుని అటువంటి పిచ్చి సమాధానాలు యివ్వడం తగ్గిస్తే మంచిది...

★ చిత్రం. ఇంట్లో అరడజను డిగ్రీవాళ్ళు. రెండు డాక్టరేట్లు లాంటివి వున్నాయి-అందుకే విశ్వవిద్యాలయాలు అంటే కాస్త తెలుసు. ఇక, ఉత్తమోత్తమమో కాదో మీరు చెప్పాలి. పూర్వం "సైన్సుకి ఆంధ్రా ఆర్ట్సుకి-మద్రాసు" అనేవాళ్ళు గర్వంగా. యిప్పుడేమంటున్నారో




చాకిరు చేయండి. కులాలవారిగా జిల్లాలవారీగా డాక్టరేట్లు పంచడం-కనీవినీ ఎరగని సంఘటన. ఓటే నాకివ్వలేదని నాకెందుకు కక్ష-మా అతడికి యిచ్చారు కదా. అసలు డాక్టరేట్లని క్యూలో నిలబెట్టి గుమస్తాలచేత డిగ్రీ కాగితాలు పంచి పెట్టించిన ఘనత రజతోత్సవ సంవత్సరంలో ఆంధ్ర విశ్వవిద్యాలయం సాధించింది. డబ్బిచ్చిన వాడు ముందు పడవెక్కాడన్నట్లు యీ యిచ్చిన డాక్టరేట్ల ముందు-నాలుగేళ్ళ రక్తం ఓడ్చి సాధించిన వారిని తీసికట్టుగా చూడడం మీకేం అనిపించలేదా?!

**టి. ఎ ఆర్ ఎమ్. — గుడివాడ**

పేరంటానికి మగవాళ్ళ నెందుకు పిలవరు? పేకాటకి ఆడవాళ్ళు ఎందుకు రారు క్లబ్బులకి?

★ అవి చాలా పాతకాలం మాటలు ఇప్పుడు ఇద్దర్ని పిలిస్తే పేరంటం; ఇక పెద్దక్లబ్బులకి, లేడీస్ క్లబ్బులకు వెళ్ళిచూడండి.

**పి. ఏ. — కడప**

ఉన్నత చదువులు చదివి ఉద్యోగాలు చేస్తున్నప్పటికీ నేటి సమాజంలో వివాహమైన స్త్రీలు భర్తలు యిష్టపడితేనే ఉద్యోగాలు చేస్తాం. లేకుంటే మానేస్తాం అని చాలా మంది చెప్తారే-స్త్రీ వ్యక్తిత్వం, స్వాతంత్ర భావాలు ఆశించే నేటి ఆధునిక సమాజంలో కూడా యిలాగే వున్నారంటే-అది స్త్రీల సహనమా, ప్రకృతి ప్రభావమా?

★ రెండూను. తరతరాల తలాపు పద్ధతి ఒక్కసారి పోదు. అంతేకాదు. భార్య ఎప్పుడూ (సంపాదించినా సంపాదించక పోయినా) భరించ బడేదేనన్న మన శాస్త్రాన్ని రంగరించి పోసి "పెళ్ళి" ధ్యేయంగా చదువూ ఉద్యోగం కూడా సాగించి-పెళ్ళయాక-"ఇక్కడ తల్లిదండ్రుల తరవాయిగా అక్కడ అత్తమామలు భర్త" అని ఒక గూటి నుంచి యింకో గూటికి మారుతోంది-ఆడది. సంపాదించే ఆడదాన్ని వద్దనే వాళ్ళుండరు కాని ఆమె సంపాదనకి-ఎక్కువ సంపాదనకిచ్చే గౌరవం యిచ్చే పెద్దలూ వుండరు. వద్దనుకుంటే మానేస్తారనా, ఎవరూ మాననివ్వరు-ఇటు సంసార బాధ్యత అటు ఉద్యోగ బాధ్యతల మధ్య సతమత మవుతూన్న ఆధునిక మహిళలను చూసే చాలా మంది అమ్మాయిలకి పెద్ద ప్రశ్న ఎదురౌతోంది-ఏదేనా చదువుకో వలసి వస్తే ఏది చదువుకోవాలి? పెళ్ళా ఉద్యోగమా? పిల్లలు కలగక ముందు సరే. తరవాత తలకుమించిన భారమైతే అప్పుడేనా మానేస్తారా? "హాయిగా పిల్లల్ని అమ్మమ్మలు చూసుకుంటారులే" అని జరిపేస్తున్నారు-ఇది స్త్రీకి అన్నివిధాలా సంధికాలం. అంటే చీకటి వెలుగుల కలయికలో ఏదీ స్పష్టంగా కన్పించదు. అందుకే మీరన్నట్లు అంటూ వుండడం విన్పిస్తుంది!

**బి ఎస్ ఆర్. — రాజమండ్రి**

ఆడదాని మనసు సున్నితం అంటారుగాని నా ఉద్దేశ్యంలో అది సినీఫీల్డులో నటన వంటిది. మరి మీ ఉద్దేశ్యం?

★ నా ఉద్దేశ్యానికేంగాని ముందు నీ అభిప్రాయానికి అర్థం తెలియచెప్పవయ్యా-నటన వృత్తి దానికీ ఆడదాని మనసు సున్నితానికీ సంబంధం ఏమిటి?



దేవులపల్లి శ్యాంసుందరరావు



# సంఘర్షణ

సుబ్బరామయ్య మామూలు ఉద్యోగి. నలుగురు పిల్లల తండ్రి. క్షణక్షణానికి రంగులు మారుస్తున్న యీ ధరలలో ఒక సామాన్య ఎన్. జి. వో నలుగురు పిల్లలతో యిల్లు గడపటం దుర్భరమనే చెప్పాలి. అత్యవసర వస్తువుల ధరలు ఆకాశాన్నంటుతుంటే, కూరగాయల ధరలు వాటిని వెన్నంటి తరుముతున్నాయి. అందుకే ఒక చిరుద్యోగి యీ రోజుల్లో 'లిమిటెడ్ సంపాదనతో' బ్రతకటం కష్టం. చేస్తే ఏ బ్యాంక్‌నైనా దోపిడీయైనా చేయాలి, లేదా బల్లకింద చేతులు చాపి జేబులన్నా నింపుకోవాలి. ఏదీ చేతకాదు అంటే నీ బ్రతుకంతా అంతే!!

సుధీర్ సుబ్బరామయ్య కొడుకై పుట్టటం ఒక తప్పయితే, మెరిట్ స్టూడెంటు కావటం రెండో తప్పు. అతడు మెరిట్ స్టూడెంటు కావటంవల్ల స్కూలు ఫైనలు మంచి మార్కులతో పాస్‌కావటం, కాదు కూడదని బి. టెక్. చదువుతానని, (యమ లెక్కలకు పోయి-సుబ్బరామయ్య దృష్టిలో) హైదరాబాదులో కాలేజీలో జాయిన్ కావటం క్రమంగా జరిగిపోయాయి. కొలీగ్స్ ప్రోత్సాహమైతేనేం, ఇరుగుపొరుగు వాళ్ల ఎంకరేజ్‌మెంటు అయితేనేం సుధీర్ కాలేజీలో జాయిన్ అయ్యాడు. ఆ నెలలోనే ఫెస్టివల్ అడ్వాన్సు తీసుకొన్నసొమ్ము(ఒక్క పది రూపాయలు మినహా) సుధీర్ చేతిలో పోసి ఫీజు కట్టి రమ్మన్నాడు.

సుబ్బరామయ్య మంచి కథకుడు. అతని కథలు వివిధ పత్రికల్లో అచ్చవుతూ వుంటాయి. అతనికి వచ్చే జీతంతోపాటు, యీ కథలకు వచ్చే పారితోషికాలు కూడా అతని సంసారానికి సరిపోవట్లేదు. అధిక ధరలు మండిపోతున్న యీ రోజుల్లో ఎన్ని డబ్బులు వచ్చినా జల్లెడతో నీళ్ళుపట్టడమే!

పరిస్థితులు మనిషిచేత ఏ పనైనా చేయిస్తాయి. అవసరం, సమయం వస్తే మనిషిచేత గడ్డి కరిపిస్తాయి. ఆ పరిస్థితుల్లో అతడు దొంగగా మారుతాడో, వ్యభిచారే అవుతాడో, హంతకుడే అవుతాడో ఎవరికీ తెలియదు. ఆపని చేసిన తర్వాతగానీ, అతడు ఏ పని చేశాడో అర్థం కాదు...

* * *

**మార్చి 9 – గురువారం :**

చేతిలో వున్న టెలిగ్రాంను మరోసారి చదువుకున్నాడు సుబ్బరామయ్య.

'సెండ్ — టూహండ్రెడ్ రూపీస్— అర్జంట్ : సుధీర్'

సంగతేమిటో తెలుసుకున్న భార్య సుజాత దిగాలు పడిపోయింది. 'ఇపుడు ఏం చెయ్యాలి?' ఏంత తనలో తాను అనుకున్నా, ఆ మాటలు బయట వినిపించక మానలేదు. సుబ్బరామయ్య ఆవేదనకూ అంతేలేదు. మధ్య తరగతి కుటుంబీకులకు ఎప్పుడు రమ్మంటే అప్పుడు డబ్బు వస్తుందా? శూన్యంలోకి చూస్తున్నాడు — రంగడు, కనకయ్య, మోహన్, ఖాదర్, జాన్... ఊహూ — ఎవరూ అప్పివ్వరు... అడగటం అంటే నామోషి. అయినా ఎవర్ని అడగటం? దాదాపు అందరి దగ్గరా... ఏదో, ఒరకో అడిగిన వాడే! కొందరి అప్పులు తీర్చాడు; కొందరివి తీరుస్తున్నాడు.

లైటువేసి, మంగళ సూత్రాన్ని కళ్ళ కద్దు కుంటుంది సుజాత. అప్రయత్నంగా అటు దృష్టిమళ్ళించిన సుబ్బరామయ్య కళ్ళు ఒక్క క్షణం ఆమె మెడమీద వాలి అలాగే నిలిచి పోయాయి...! ఏవేవో వూహాలు రూపు దిద్దు కుంటున్నాయి... అలా చేస్తే...?!

తప్పు!

ఏది తప్పు??

ఎందుకు తప్పు??

అడిగితే... ...

ఇస్తుందా ...?

నో... ... నోనో......

ఇటువంటి విషయాలలో సమయ స్ఫూర్తితో ఏవో చెయ్యాలి...ఏదో చెయ్యాలి. చెయ్యాలి ...... ......

మార్చి 10 — శుక్రవారం :

'శ్రీ రంగ నాయకీ గోదా
విష్ణు చిత్తాత్మ జానతీ!
గోపీ వేషధరా దేవీ
భూసుతా భోగ శాలినీ!!'

ఆరోజు శుక్రవారం అవటం మూలానా సుజాత పూజ చేసుకుంటుంది. దినచర్య లన్నీ పూర్తి చేసుకున్నా సుబ్బరామయ్య ఓ మూల వణుకుతూ కూర్చున్నాడు. ఎన్నడూ లేనిదీ అతని శరీరంలో ఒక విధమైన కంపన ప్రారంభమైంది. అతని మనసు తీవ్ర సంఘర్షణకు లోనైంది. 'నీవేదో తప్పు చేసావని' ఏత్తిపొడుస్తుంది. పూజ ముగించుకొని బయటకు వచ్చిన సుజాత దేవుని ప్రసాదం పెట్టింది.

'దేవా, నీవే దిక్కంటూ' నోట్లో వేసుకున్నాడు.

గబ గబా వచ్చింది సుజాత!

'ఏమండీ, నా గొలుసు ... నా గొలుసు కనబడటంలేదండీ ...' ఆ స్వరంలో ఆతురత, భయం కనిపించాయి.

'ఏమిటి? ఏమిటే??' అంతకన్నా భయం మేళవించిన స్వరంతో అడిగాడు సుబ్బరామయ్య.

అంతా వెతుకుతున్నారు—

ఇల్లంతా తొక్కిసలాటగావుంది—

లాభంలేదు—

'అమ్మో, అమ్మో' అంటూ స్వరం ఎక్కువ చేసింది సుజాత. కసురుకున్నాడు సుబ్బరామయ్య.

'అనవసరంగా గాబరాపడకు. ఇంకోసారి బాగా చూడు.'

'ఇంకా చూడటమేమిటండీ- నాటొంద. ఎవరో దొంగ ముండాకొడుకు దొంగిలించి వుంటాడు...'

గదమాయించాడు సుబ్బరామయ్య 'అనవసరంగా ఎందుకు తిడతావే? బాగా వెతికితే దొరుకకపోదు.'

పోలీస్ రిపోర్టు యిద్దామంది సుజాత. కాని ససేమిరా వీల్లేదన్నాడు సుబ్బరామయ్య. ఇంక అక్కడుంటే లాభంలేదనుకొని అతను బట్టలు వేసుకొని బజారుకు బయలుదేరాడు. నడుస్తున్నాడన్న మాటేగానీ, అతనిలోని మనసు విభిన్న రూపాలు దాల్చి ఒకదానితో నొకటి ఘర్షణపడుతున్నాయి;సంఘర్షణపడు తున్నాయి. ఈ కొద్ది గంటలలోనే అతడు తీవ్ర మానసికాందోళనకు లోనైయ్యాడు. తన భార్య ముఖంకేసి చూడాలంటేనే భయం!

అప్పుడే దుకాణాలు తెరుచుకుంటు న్నాయి. శెట్లు లక్ష్మీదేవి పటాల ముందు మోకరిల్లి, ఊదిబత్తీలు ముట్టిస్తున్నారు. ఎదురుగా కనిపిస్తున్న నగల కొట్లోకి వెళ్ళి నమస్కారంచేసి, తను వచ్చినపని చెప్పాడు. ఆ శెట్టు సవాలక్ష ప్రశ్నలు వేసి 'నై'అన్నాడు. మారు పలక్కుండా బయటికి వచ్చాడు.

ఇంకో దుకాణానికి వెళ్ళాడు... ఇంకోటి.. ఇంకొకటి... దాదాపు నగల కొట్లన్నీ తిరిగాడు. అనుకున్న పని నెరవేరలేదు. అతను ఏదైతే అనుకున్నాడో, అది వాళ్ళకు నచ్చలేదు; వాళ్ళు ఏదైతె అన్నారో యితనికి నచ్చలేదు.

దిగాలు పడి నడుస్తున్నాడు—

ఏలాగూ ఆఫీసు టైం అయిపోయింది. అతని మనసు మనసులో లేదు. తీవ్రంగా ఆలోచిస్తున్నాడు; తనలోతనే మాట్లాడు కుంటున్నాడు; ఒక్కొక్కసారి తానున్న పరిసరాలు గుర్తుకు రాగానే, తననెవరైనా చూస్తున్నారా అని చుట్టూ చూసు కుంటున్నాడు.



ఎదురుగా నేషనలైజ్డ్ బ్యాంకు బోర్డు కనిపించింది. వెంటనే ఒక ఐడియా తట్టింది. ఏనుగు ఎక్కినంత సంబరమైంది అతనికి. వెంటనే లోపలికి వెళ్ళి మేనేజర్ని కలుసుకున్నాడు. 'ఇపుడు ఏ బ్యాంకులోగాని బంగారు నగలు తాకట్టు పెట్టుకోవట్లేదని' విని అవాక్కయ్యాడు. రిజర్వు బ్యాంకినుంచి తిరిగి యిన్‌స్ట్రక్షన్స్ వచ్చేంత వరకూ ఏ బ్యాంకులో బంగారు నగలు తాకట్టు పెట్టుకోరట.

ఉసూరుమంటూ యింటి కొచ్చాడు... అతని శరీరం జ్వరం వచ్చినట్లుయింది. భార్య ముఖంలోకి సూటిగా చూడలేక పోతున్నాడు. పిల్లలతో సరిగా మాట్లాడలేక పోతున్నాడు. ఆ 'పదార్థాన్ని' ఎక్కడ దాచాలో అర్థం కాలేదు అతనికి ఆ క్షణంలో చావాలనిపించింది. భోరున ఏడవాలనిపించింది. ఇంకా ఏమేమో చెయ్యాలనిపించింది. కాని ఏమీ చెయ్యలేక, నిస్సహాయతతో కూలబడ్డాడు. మొగుడు గంభీరంగా వుండటం చూసి సుజాత కూడా మాట్లాడకుండా మిన్నకుంది. అన్నానికి లేపటానికి కూడా సాహసించలేదు.

మార్చి 11 - శనివారం

'టెలిగ్రామ్' అన్న కేకతో సుబ్బరామయ్య నెత్తిన పిడుగు పడ్డట్టయింది. ఒక టెలిగ్రాంతోనే చస్తుంటే మరొకటా? హే భగవాన్ ! నామీద యింత కోపం




## సంఘర్షణ

దేనికయ్యా ? నేనేం పాపం చేశానని ??

'టెలిగ్రాంసార్'

భగవంతునితో పోట్లాట ఆపేసి యింటి ముందు కొచ్చాడు. సంతకంచేసి వణికే చేతులతో, అదిరే పెదవులతో, మనసు వేయి అశుభాలను పలుకుతుంటే ఆ టెలిగ్రామ్ సీలు విప్పాడు ...

అతని కళ్లలో వేయి జ్యోత్స్నలు వెలిగాయి !

అతని శరీరం ఆనందంతో గంతులు వేయసాగింది !!

ఒక విధమైన ఆనందోద్వేగంతో అతని తనువులోని అణువు అణువు ఎగిసి పడుతుంది !!!

భర్తలోని యీ అకాల ఆనందానికీ, ఆ టెలిగ్రామ్‌కు గల సంబంధమేమిటో ఆ భార్యామణికి అర్థం కాలేదు. కాని చాలా సంతోషం వేసింది. తండ్రి పడుతున్న సంతోషపన్ను పిల్లలు కూడా పంచుకున్నారు !

ఇంతకూ ఆ టెలిగ్రామ్‌లోని సారాంశం: సుబ్బరామయ్యచే వ్రాయబడిన 'సంఘర్షణ' అనే నవలకు, ఒక ప్రసిద్ధ పత్రికచే నిర్వహించబడిన పోటీలో ప్రథమ బహుమతి వచ్చింది. మూడువేల రూపాయిల పారితోషికం కూడా గెల్చుకుంది.

ఇపుడు అతని జేబులో నున్న ఆ 'గొలుసు' బరువు కొన్నివేల టన్నుల బరువుగా తోచింది. వెంటనే ఆ పొట్లాం భార్య చేతిలో పెట్టి భోరున ఏడిచాడు; క్షమించమని అడిగాడు. పిల్లలూ, భార్య బిక్కు బిక్కు మంటూ చూస్తున్నారు. ఆ యిల్లాలికి యీ సంతోష సమయంలో పోయిన గొలుసు కూడా దొరకటం యింకాస్త సంతోషాన్ని కల్గించింది. ఆ భార్యా భర్త లిద్దరూ పిల్లలున్నారనే సంగతి కూడా మరచిపోయి, గట్టిగా వాటేసుకున్నారు !

పిల్లలంతా కళ్ళు గట్టిగా మూసుకున్నారు !!

పాఠకులకు సంక్రాంతి కానుక

నవజ్యోతి పబ్లికేషన్స్
ఏలూరు రోడ్
విజయవాడ-2

ప్రచురణకు ముందే పాఠకులకు 8/- రూ.ల లాభం
కళాప్రపూర్ణ పురిపండా అప్పలస్వామి
వచనంలో రాసిన నిత్యనూతనమైన రామాయణ
భారత, భాగవత కావ్యాలను మా సంస్థ తొలిసారిగా
ఈ సంక్రాంతికి పాఠకులకు సరసమైన ధరల్లో-
అందిస్తోంది! ఒక్కొక్కటి 10 రూపాయలు!
ప్రచురణకు ముందే రూ.లు 25 పంపితే
జనవరి 10వ తేదీలోగా పోస్టేజి మేమే
భరించి, ఈ మూడు వచన కావ్యాలని మీకందిస్తాం!
(అంటే ధరలో 5 రూ.లు, పోస్టేజీ 3 రూ.లు... వెరసి
8 రూ.లు లాభమన్న మాట!)
CHANDRA



# వంటలు

## ప్రాన్స్ బిర్యానీ

కావల్సినవి : రొయ్యలు (తొక్కతీసినవి) అరకేజీ, పలావ్ బియ్యం 1 కేజీ నెయ్యి లేక డాల్డా అరకేజీ, జీడిపప్పు 100 గ్రా మసాలా దినుసులు 100 గ్రా.

తొక్కతీసిన రొయ్యల్ని డాల్డాలో మొదట వేయించాలి. అటుపైన అందులో మూడు లేక నాలుగు గ్లాసుల నీళ్ళను పోసి దించాలి. మసాలా ద్రవ్యాన్ని డాల్డాతో తాలింపు పెట్టి అందులో రొయ్యల్ని, వాటితోపాటు నీళ్ళను వేసి బాగ మరగ నివ్వాలి. కొంచెం సేపు తరువాత కడిగిన పలావ్ బియ్యాన్నిపోసి సెగమీద ఉడకనిస్తే పావుగంటలో ప్రాన్స్ బిర్యానీ తయారవుతుంది.

— కె. సీత.

## అలన్

కావలసిన పదార్థాలు : అల్లము చిన్న ముక్క, వెల్లుల్లి 4 రేకలు, ఉల్లిపాయ 1 పెద్దది, శెనగపిండి 1 గ్లాసు లేదా 100 గ్రాములు.

అల్లము వెల్లుల్లి మెత్తగ నూరి ఉంచుకోవాలి. ఉల్లిపాయలు సన్నగ తరుగుకోవాలి. శెనగపిండి గరిటె జారుగ నీరుపోసి కలిపి ఉంచుకోవాలి. స్టౌమీద గిన్నెపెట్టి రెండు స్పూనుల నూనె పోసి కాగిన తదుపరి అల్లము వెల్లుల్లి ముద్దవేసి వేపి ఉల్లిపాయ ముక్కలు వేసి కలిపి తగుమాత్రము ఉప్పు, పసుపు, కారము వేసి ఒకగ్లాసు నీరు పోసి మూతమూయవలెను నీరు తెర్లుతున్నపుడు కలిపి ఉంచుకొన్న శెనగపిండి పోసి కలిపి సన్నని మంట మీద ఉంచి చిక్కబడి దగ్గర పడగానె దింపివేయవలెను. పై కూర అన్నములోకి, చపాతీలలోకి, పూరీలలోకి కూడ పనికి వచ్చును.

— మాదిరెడ్డి లక్ష్మీరమాపతి

WHEN NATURE FAILS

New Super Height (For Super Heightness) మరింతవిత్తు, పొడుగు కాగలరు 2 మండి 8 అం.

HYTEX is a great name and meant for popular people. 1 Phail (20 TABS.) Rs 7 50 advance By M.O 3 Phails (60 Tabs) Rs. 15/- money order by advance

M/S. VICTORIA COMMERCIAL COY
Seat No. 1, Ambala Cantt-133001 (N.I.)
Correspond in English AMW/1/79

దేవి మిట్
వాడండి ముఖ్యంగా
SEALED PACKING 10 & 14 TABLETS
AVAILABLE AT ALL CHEMISTS
Mfrs. SEENU & Co . MADRAS-21

వీనస్ వాటర్ హీటర్లు



మొదటగా IS: 2082 ISI సర్టిఫికెట్ పొందినది

వెంట్ పైపు అక్కరలేనిది !! దృఢమైన నిర్మాణము

మెయిన్ డీలర్లు :

సోనోవిజన్ ఏలూరు రోడ్డు, విజయవాడ-2.

SUVARNA






Dattaram-NP-24-Tel

# జారుడు బల్లమీద గాజుగ్లాసు

ఈ గమత్తు చేయడానికి 1. నున్నని పొడుగుపాటి గాజుపలక 2. ఒక గాజు గ్లాసు ఉంటే చాలు.

నున్నని గాజు పలకని ఒక కొసనేలమీద, రెండవకొస పుస్తకాల దొంతర మీద ఉంచి, ఏటవాలు జారుడు బల్లలాగ చెయ్యాలి. అంచులు నున్నగా, సమంగా ఉన్న గాజుగ్లాసును ఆ గాజు పలక మీద బోర్లించి పెట్టు. ఆ పలక వాలు ఎలా ఉండాలంటే, మరో పెన్సిలుక వాసి ఎత్తితే గాజుగ్లాసు కిందికి జారి పోవాలి. పుస్తకాల దొంతర ఎత్తు మార్చడం ద్వారా గాజుపలక వాలును ఈవిధంగా సర్ది, గ్లాసును బోర్లించి ఉంచాలి. ఈస్థితిలో గ్లాసుకిందికి జారదు అన్నమాట.



ఇప్పుడు గాసును పలక మీద నుంచి తీసి,దానిలో వేడి వేడి నీళ్ళుపోసి, నీళ్ళ ఒలక పోసేసి, వెంటనే గ్లాసును వాలు గాజుపలక పైభాగాన బోర్లించి వదిలెయ్య ఏం జరుగుతుందో చూడు.

శీతల దేశాలలో చలికాలంలో మంచు కొండల మీదనుంచి ఆటగాళ్లు కాళ్ళకి క్రర పలకలు కట్టుకుని కిందికి జారుతూ ఉండడం ఏసినిమాలోనైనా చూసే ఉంటారు. ఆ ఆటని "స్కీయింగ్" అంటారు. ఆ ఆటను మన గాజుగ్లాసు కూడా నేర్చుకుందా అన్నట్లు నేర్పుగా గాజపలక మీద జరు-జరు – జరు మంటూ కిందికి తమాషాగా జారుతూ, ఆగుతూ, జారుతూ వస్తుంది.

గ్లాసు ఈవిధంగా జారగలగడానికి కారణం ఏమిటో తెలుసా? గ్లాసుకి తడి ఉండడం వల్ల అనుకుంటారేమో, అదికాదు అసలు కారణం.

గ్లాసులో ఉడుకునీళ్ళుపోసి, కొంచెం సేపుంచి, పూర్తిగా పంపేసి, పలక మీద బోర్లించడం వల్ల గ్లాసు లోపలిగాలి ఇంకా వెడిగా ఉంటుంది. వేడివల్ల గాలి వ్యాకోచిస్తుందనీ, చలివల్ల సంకోచిస్తుందనీ మనకు తెలుసుకదా? గ్లాసులోపలి గాలి వ్యాకోచించి, బయటికి పోవడం కోసం గ్లాసుఅంచును కొద్దిగా పైకి ఎత్తుతుంది. అంచు పైకి లేవడం వల్ల పలకకి, గ్లాసు అంచుకీ మధ్య ఘర్షణ తగ్గి, భూమి ఆకర్షణ వల్ల కొద్దిగా కిందికిజారుతుంది. వేడిగాలి కొద్దిగా బయటికి పోగానే గ్లాసు అంచులు బల్లమీద మళ్ళీ పూర్తిగా అనుకుంటాయి. ఘర్షణ పెరిగి, జారుడు తాత్కాలికంగా ఆగుతుంది. ఈవిధంగా వేడిగాలి బయటికిపోయే ప్రయత్నంలో గ్లాసు అంచును కొద్దిగా పైకి ఎత్తడం, తడివల్ల నును పెక్కిన గాజుపలక మీద గ్లాసు కొంచెం దూరం జరిగి ఆగడం, ఈ ప్రక్రియలు మళ్ళీ మళ్ళీ జరిగి, గ్లాసు కిందిదాకా వస్తుంది.

—డా॥ మహీధర నళినీమోహన్

## చెవుడుకి శస్త్ర చికిత్స

చెవుడు నివారణకు ఒకభారీ వైద్య కేంద్రం సోవియట్ ఉక్రెయిన్ రాజధాని కీవ్‌లో ప్రారంభించబడింది. చెవికి సంబంధించిన రోగాలను కనుగొని, వైద్యం చేయడంలో ఆధునిక పద్ధతులను అనుసరించడానికి ఒక పరిశోధన కేంద్రంలో విస్తారమైన కృషి చేస్తున్నారు. చెవి శస్త్రి చికిత్సా పద్ధతులు క్రమంగా మెరుగు అయ్యాయి నేడు వంద శస్త్రి చికిత్సలలో 98 జయప్రదమవుతూ వున్నాయి. బండ చెవుడు కూడా శస్త్రి చికిత్సల వల్ల పూర్తిగా నయమవుతూ వుంది. 30-40 సంవత్సరాలుగా వున్న చెవుడును కూడా పూర్తిగా నయం చేయడం జరుగుతూ వుంది. ఈ నూతన వైద్య కేంద్రంలో చెవుడు నివారణ వైద్య సర్వీసు లన్నీ ఉన్నాయి. శస్త్రి చికిత్సలో వున్న రోగులకు సుప్రసిద్ధులూ,అర్హతలు గలిగిన నిపుణులు అహర్నిశలూ తోడ్పడతూ వున్నారు లేదా సంప్రదాయ వైద్యం చేస్తూ వున్నారు.



# "నాటినుండి నేటివరకు కేశాలంకరణ" పోటీ
## సరిఅయిన సమాధానాలు


1. సుమేరియన్


2. ఈజిప్ట్


3. జపాన్


4. రాజస్థాన్


5. అజంతా


6. విజయనగర్


7. ఆధునిక

## మొదటి బహుమతి పొందినవారు

**శ్రీమతి జి. నారాయణమ్మ**
విజయనగరం (ఆం.ప్ర)
ఒక అల్విన్ క్వీన్ రిఫ్రిజిరేటరు (200 లిట్లర్లు)

## రెండవ బహుమతి పొందినవారు

**A. కుమారి కృష్ణవేణి**
కొత్త ఢిల్లీ-5

**B. శ్రీమతి రెహనాబేగం**
పాడేరు - విశాఖ జిల్లా

పై ఇరువురికి ఒక్కొక్క గ్రోద్రేజ్ స్టీలు బీరువా, స్టోర్‌వెల్

**మూడవ బహుమానం ఎవరూ సరియగు సమాధానము పంపనందున రద్దు చేయబడినది.**

**నాలుగు, ఐదు, ఆరు బహుమతులు పొందినవారికి పోస్టు ద్వారా తెలియచేయబడినవి.**


# మీ కేశ సంపదకు
# రీటా





**ఈ పోటీలో బహుమతులు నిర్ణయించిన జడ్జిలు**

1. శ్రీమతి రామలక్ష్మి ఆరుద్ర 2. శ్రీమతి వి. లీలావతి రాఘవయ్య 3. శ్రీమతి మాలతి చందూర్

నెలకు రు. 1000 సంపాదించండి
ఎలక్ట్రిక్ గైడు రు. 10, ఫొటోగ్రఫీ రు. 6, రేడియో గైడు రు. 10, వివాహ జీవితము 100 బొమ్మలతో రు. 7, వెదికలో సెక్సు గైడు 88 బొమ్మలతో రు. 10, డ్రాయింగ్, పెయింటింగ్సు గైడు రు. 8, టైలరింగ్ & కట్టింగ్ రు. 7, 350 ఎంబ్రాయిడరీ డిజైన్సు రు. 8, సబ్బు తయారీ రు. 5, 300 కుటీర పరిశ్రమ గైడు రు. 15.
ప్రతి ఒక్కటి పోస్టేజి రు. 1—50.
ILFA BOOK DEPOT ALIGARH 25

డా పి.వి.కె. రావ్, B.A. సెక్సు స్పెషలిస్టు
వైద్య విద్వాన్—వైద్యాచార్య
స్వప్రయోగం నరములు బల హీనత, అంగము విస్తరించుట, శీఘ్రస్ఖలనము, శుక్లనష్టము మొ॥ సంభోగ వ్యాధులకు, మానసిక వ్యాధులకు శాస్త్రీయ చికిత్స, పోస్టు ద్వారా కూడా చికిత్స గలదు.
రావూస్ క్లినిక్,
టి.బి. రోడ్, తెనాలి, ఫోన్ : 700.

యూకాన్
పేలు, చుండ్రు నివారిణి.
అన్నిషాపులలో దొరకును
మాన్‌ఫార్మా, విజయవాడ - 2.

PHONE No. 23
P.B. No. 30
శ్రీ
ఆభరణములు నమ్మదగినవి.
శ్రీ గోల్డు కవరింగ్ వర్క్సు
మచిలీపట్నం.
NIRMAL
సేల్సు బ్రాంచీలు

# వారఫలం

**5–1–1979 శుక్రవారం మొదలు**
**11–1–1979 గురువారం వరకు**

**మేషం:—** వృత్తి వ్యాపారాలు లాభదాయకంగా వుంటాయి. పోటీ వారిలో గౌరవం లభిస్తుంది. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయోజనం గల సంభాషణలు జరుపగలరు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి, అలంకార వస్తువులు కొంటారు.

**వృషభం:—** చేజిక్కిన అవకాశాలు కూడా జారి పోవచ్చును. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. మిత్రులకు చికాకులు ఏర్పడతాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిధునం:—** వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం ఆఖరులో మీ కాలూకు వస్తువులు పోవచ్చును. లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం వస్తుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కర్కాటకం:—** అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**సింహం:—** అనుకూలమైన వార్తలను వింటారు. మిత్రులకు సహాయం చేస్తారు. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్త్రీలకు— పుణ్య కార్యాలు చేస్తారు. శుభ కార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**కన్య:—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. ఆందోళన కలుగుతుంది. వ్యాపారంలో ప్రయాస కలుగుతుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు అనుకూలంగా వుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సంతోషకరమైన సమాచారం అందగలదు.

**తులా:—** ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. రావలసిన డబ్బు అందుతుంది. పోటీ వారిలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. మీ కాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది.

**వృశ్చికం:—** వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో ప్రయాణాలు ఫలిస్తాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**ధనుస్సు:—** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. ఎవరితోను వాద ప్రతివాదాలు తగవు. స్త్రీలకు— సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. అలంకారం కోసం వ్యయం చేస్తారు.

**మకరం:—** ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. దైవ కార్యాలు నెరవేరతాయి. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ప్రయాణాలు అనుకూలంగా వుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**కుంభం:—** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. మీ మంచి తనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. పోటీ వారిలో గౌరవం లభిస్తుంది.

**మీనం:—** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. వ్యాపారంలో పోటీవారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

—మహేష్

వనితలకు మనవి
కొత్తరకం వంటలు
స్పష్టంగా వ్రాసి పంపితే
త్వరగా పరిశీలించ వీలు —సం.

# హైదరాబాద్ నోట్‌బుక్

### డాక్టర్ నార్ల వారికి సన్మానం :—

డాక్టర్ నార్ల వెంకటేశ్వరరావు, అత్యయిక పరిస్థితిలో ఎందరో పత్రికా రచయితలు కుక్కిన పేనుల్లాగా వుండిపోగా, తమపత్రికల కార్యాలయాలలోనే నిరంకుశాధికారులు నల్ల సిరాతో వార్తలను తుడిచివేస్తున్నప్పుడు-ఇది తప్పు అని ఘంటాపథంగా గొంతుచింపుకొన్నవారు. ఆయన 71వ జన్మ దినోత్సవం వంశీ ఆర్ట్స్ థియేటర్స్ డిసెంబర్ 2వ తేదీన సన్మానించడం సముచితమే కాక గర్వ కారణం కూడ. రాష్ట్ర గవర్నర్ శ్రీ కె.సి. అబ్రహాం శ్రీ నార్లను సన్మానించారు. సభకు అధ్యక్షత వహించిన రాష్ట్ర ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావు శ్రీ నార్ల సాంఘిక దురన్యాయాలకు వ్యతిరేకంగా నిరంతరం పోరాడుతూనే వున్నారని ప్రశంసించారు. హైదరాబాద్ ఫిల్మ్ సర్కిల్ అధ్యక్షుడు శ్రీ టి. సుబ్బరామరెడ్డి శ్రీ నార్లకు మొమెంటో అందజేశారు. ఆంధ్రప్రభ వార పత్రిక సంపాదకులు శ్రీ విశ్వం ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు రచయిత్రులు కుమారి వాసిరెడ్డి సీతాదేవి, శ్రీమతి మాదిరెడ్డి సులోచన ప్రసంగించారు. శ్రీ నార్ల సమాధానమిస్తూ తాము యావజ్జీవం న్యాయం కోసం సమరం సాగిస్తూనే వుంటామన్నారు. శ్రీ నార్ల వివాహమై సరిగ్గా ఈనాటికే నాలుగు దశాబ్దాలు కావడంతో, ఈ సందర్భంగా శ్రీ నార్ల సతీమణి శ్రీమతి సులోచనా దేవి, శ్రీ నార్ల పరస్పరం దండలు మార్చుకొని ప్రేక్షకులను ఆనందపరచారు.

### శ్రీ ఎక్‌బోటేకు కొత్త పదవి :—

మాజీ రాష్ట్ర ప్రధాన న్యాయమూర్తి, మాజీ మంత్రి శ్రీ గోపాలరావు ఎక్‌బోటే మరాఠీ సాహిత్య పరిషత్తు హైదరాబాద్ శాఖ అధ్యక్షుడుగా నవంబర్ 30న జరిగిన సమావేశంలో ఎన్నికయ్యారు. కార్యదర్శి శ్రీ డి.పి. జోషి, మరాఠీ విద్యాలయానికి గ్రాంటుమంజూరు చేసినందుకు ఈ సమావేశంలో కృతజ్ఞత తెలిపారు, రాష్ట్ర ప్రభుత్వానికి సెకెండరీ పాఠశాలల్లోని మరాఠీ విద్యార్థులకు పాఠ్య పుస్తకాలులభించడం లేదని, రాష్ట్ర ప్రభుత్వం తగిన చర్య తీసుకోవాలని శ్రీ జోషి కోరారు.

### ఉస్మానియా హౌస్ సర్జన్ల సమ్మె :—

ఇందిరా యువజన కాంగ్రెస్ నాయకుడు శ్రీ కె. హనుమంతరావు నవంబర్ 29వ తేదీ రాత్రి ఉస్మానియా జనరల్ ఆస్పత్రిలో ప్రవేశించి ఒక హౌస్ సర్జనును కొట్టారనే కారణంగా 350 మంది హౌస్ సర్జనులు నవంబర్ 30వ తేదీ నుంచి సమ్మె చేశారు. అవమానితుడైన హౌస్ సర్జను పేరు ఎం. పాపయ్య. రాత్రి పూట డ్యూటీలో వుండే వైద్యులకు ప్రమాదం జరుగకుండా ప్రభుత్వం రక్షణ కల్పించాలని ఆస్పత్రి సూపరింటెండెంట్ డాక్టర్ ఎం. వెంకటరావు ముఖ్యమంత్రికి, ఆరోగ్య శాఖ మంత్రికి విజ్ఞప్తులు పంపారు. డిసెంబర్ 1వ తేదీన ఉస్మానియా ఆస్పత్రి సీనియర్ డాక్టర్లు డాక్టర్ ఎం. వెంకటరావు అధ్యక్షతన సమావేశమై నిర్ణయించిన తర్వాత, ఒక ప్రతినిధి వర్గం ఆరోగ్య శాఖామంత్రి శ్రీ మదన్‌మోహన్‌ను కలుసుకొంది. దోషిపై తగుసమ్మతమైన చర్య తీసుకుంటామని, ఇక మీద ఇలాటి దుశ్చర్యలు జరుగకుండా చూస్తానని మంత్రి హామీ ఇవ్వడంతో డిసెంబర్ 2వ తేదీ సాయంకాలానికి సమ్మె సమాప్తమయింది. హనుమంతరావు చర్యను సివిల్ సర్జన్ల సంఘం, అసిస్టెంట్ సివిల్ సర్జన్ల సంఘం, భారతీయవైద్య సంఘం, అఖిల భారత డాక్టర్ల సంఘం తీవ్రంగా ఖండించింది.

### నాదస్వర శిక్షణకు సహాయం :—

హైదరాబాద్‌లోవున్న ప్రభుత్వ సంగీత నృత్య కళాశాల సప్తాహాన్ని సాంకేతికవిద్య, కళల అకాడెమీ మంత్రి శ్రీ టి. హయగ్రీవాచార్యులు డిసెంబర్ 2వ తేదీన ప్రారంభిస్తూ, ఇటువంటి ఉత్సవాలవల్ల కళాశాలల ప్రాముఖ్యం ప్రజలకు తెలుస్తుందని, సంగీత నృత్యాది లలితకళలలో ప్రజలకు ఆసక్తి ఏర్పడుతుందని అన్నారు. నాదస్వర వాద్యంలో ప్రమాణాలు పడిపోతున్నందుకు శ్రీ హయగ్రీవాచార్యులు ఆందోళన ప్రకటిస్తూ, నాదస్వర శిక్షణకోర్సు సంగీత కళాశాలలో ఏర్పాటుచేయడమేకాక, వెనుకబడిన తరగతి వారయి నాదస్వరం కులవృత్తిగా గల విద్యార్థులకు ఆర్థిక సహాయం చేస్తామని, పేరిణి నృత్యరీతిని నృత్యంలో పాఠ్యాంశంగా ప్రవేశపెట్టదలచుకొన్నామనీ అన్నారు. విద్యా శాఖ డైరెక్టరు శ్రీ పి. ఆదినారాయణ ప్రముఖవాగ్గేయకారుల చిత్రాలను ఆవిష్కరించారు. కళాశాల ప్రిన్సిపాలు నూకల చినసత్యనారాయణ నివేదికను సమర్పిస్తూ, హైదరాబాద్ సంగీత నృత్య కళాశాల యావద్భారతంలోను పెద్దదని, 30 మంది అధ్యాపకులు, 700 లకు పైగా విద్యార్థులు వున్నారని, హిందూస్థాన్, కర్నాటక సంగీతాలు, భరతనాట్యం, కథక్ నృత్యం, వున్నవన్నారు. డిసెంబర్ 8వ తేదీ వరకు సప్తాహం జరిగింది.

---

## మిగిలిన విషయాలు

"వరకట్నాలు నశించాలి.
వాటిని నిషేధించాలి"
అని వేదిక లెక్కి కేక
లెట్టాడు కుర్రాడు ఒకనాడు.

"అమ్మాయి నచ్చింది.
'మిగిలిన విషయాలు' మానాన్న
మాట్లాడతాడు." అన్నాడు
పెళ్ళి చూపులనాడు.

— నాయుడు

---

### రాష్ట్ర సాహిత్య అకాడెమీ ఎన్నికలు పూర్తి :

ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడెమీ ఎన్నికలు పూర్తయాయి. సంస్థలనుంచి, విశ్వ విద్యాలయప్రాంతాలనుండి ఎన్నికయినవారు, వివిధ విశ్వవిద్యాలయాల ప్రతినిధులు, వివిధ అకాడెమీల ప్రతినిధులు, పదిహేను మంది విశిష్ట సభ్యులు, పదిమంది ప్రభుత్వ నియమితులు మొత్తం-71 మంది సభ్యులుంటారు జనవరి మూడవ వారంలో నూతన సర్వసభ్య సమావేశం జరుగుతుంది నూతన అధ్యక్షుని, కార్యవర్గ సభ్యుల ఎన్నిక జరుగుతుంది

### బాలల సంవత్సరం నిర్వహణకు 20 కోట్లు :

1979ని అంతర్జాతీయ బాలల సంవత్సరంగా పరిగణించి జరిపే కార్యక్రమాలకు రాష్ట్రంలో 20 కోట్ల రూపాయలు ఖర్చుకాగలదని స్త్రీ శిశు సంక్షేమ శాఖామంత్రిణి శ్రీమతి రోడామిస్త్రీ డిసెంబర్ 4వ తేదీన పత్రికా ప్రతినిధులగోష్ఠిలో తెలిపారు ఈ కార్యక్రమాలన్నీ దాదాపు జనవరి మొదటి తేదీన ప్రారంభిస్తామని, ప్రతి జిల్లాలోను బాలవాడీలు, శిశు సంరక్షణాలయాలు స్థాపిస్తామని, గ్రంథ ప్రచురణలు చేపడతామని అన్నారు. వివిధ సంస్థలు సూచించిన పథకాల అమలుకు 20 కోట్లు వ్యయ మవుతుందన్నారు.

### విమానాశ్రయంలో వింత జంతువు :—

పంగోలిన్ అనే అరుదైన సరీసృపం నవంబర్ 24న బేగంపేట విమానాశ్రయంలో కనిపించింది. ఇది దాదాపు రెండున్నర అడుగుల పొడువుంటుంది శరీరం పెచ్చులు పెచ్చులుగా వుంటుంది దీనిఆహారం ప్రధానంగా చీమలు దీనిని నెహ్రూ జూలాజికల్ పార్కుకు చేర్చారు దీనిని కన్నజంతువులూ కనిపించాయని, వాటిని రాత్రిప్పు తరిమి కొట్టినారమని విమానాశ్రయం రక్షణాధికారులు తెలిపారు.

### ఉపశ్రుతి :—

"కాలం ఎంత చెడిపోయిందోయ్" అన్నాడు నా మిత్రుడొకడు. మా సంభాషణ వింటూన్న ఏడేళ్ళ పద్మ "గాంధీతాత కాలంలో ఎంతో బాగుండేది" అన్నది హఠాత్తుగా. "గాంధీతాతను చూశావా? ఆ కాలంలో నీవు ఉన్నావా" అనడిగాను. "నేను లేను లేకపోతే ఏం? ఇంతకన్నా బాగానే వుంటుంది కాలం" అన్నది. "చూశావా, పసిపాప ఆలోచన!" అన్నాడో మిత్రుడు

— తిరుమల రామచంద్ర

గేయాలు పంపేవారు వాటితో తపాలా కార్డు జత పరచవలసి వుంటుంది. గేయాలు త్రిప్పి పంపబడవు. గేయాలు, కవితలు సాధ్యమైనంత క్లుప్తంగా వుండటం మంచిది —సం.

# అవీ-ఇవీ-అన్నీ

## తెలుగు పఠన మందిరం

డిసెంబర్ 10న మద్రాసు విల్లివాక్కం తెలుగు పఠన మందిరం 16వ వార్షికోత్సవం ఇంటిగ్రల్ కోచ్ ఫ్యాక్టరీ అంబేద్కర్ హాలులో జరిగింది. కళాసాగర్ అధ్యక్షులు డా. సి. ముద్దు కృష్ణారెడ్డి అధ్యక్షత వహించారు. సినీనటుడు నాగభూషణం, రచయిత ఆరుద్ర, పచ్చయ్యప్పాస్ కళాశాల తెలుగు హెడ్ ఆఫ్ ది డిపార్ట్మెంట్ డా. ఉషారాణి మొ॥గు వారు ప్రసంగించారు. నటి రమాప్రభ బహుమతి ప్రదానం చేశారు. కార్యదర్శి వై. ఉమామహేశ్వరరావు నివేదిక సమర్పించారు. ఉపాధ్యక్షుడు వి.వి. చలపతిరావు వందన సమర్పణ చేశారు.

## తథాగతుని కథ

శ్రీ ఎస్. రతన్ బాబు రచించిన తథాగతుని కథ వచన 165 పుటలు. బాపూ ముఖచిత్ర రచనతో అందంగా వెలువర్చారు. ప్రతులకు ప్రచురణ కర్తలు దేవేంద్ర పబ్లిషర్స్ విజయవాడ-2కి వ్రాయవచ్చును. వెల 7 రూపాయలు.

## రణభేరి

ప్రబోధగీతాలు-కవితలు. రచన: శ్రీ వి.వి. వసంతరాయ్. 32 పేజీలు. వెల రెండు రూపాయలు. ప్రతులకు: వసంత్ పబ్లిషింగ్ హౌస్, చర్చిరోడ్డు, మిర్యాలగూడ-508 207.

## వేణీ సంగమం

పద్య గేయ కృతి. రచన: శ్రీ రావికంటి వసునందన్. 50 పేజీలు. వెల మూడున్నర రూపాయలు. ప్రతులకు: 1) ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్ రోడ్డు, హైదరాబాదు-1. 2) ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతి రోడ్డు, సికింద్రాబాదు-500 003.



గణపవరంలో శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి దేవస్థానంలో స్వామి కల్యాణమహోత్సవాలు జరిగాయి. అందులో వర్ధమాన సినీనటి, కుమారి ఉదయరంజని భరత నాట్యం, కూచిపూడి, జానపద నృత్య రీతులను ప్రదర్శించి ప్రశంసలందుకున్నది.

దేహపుష్టికి ఆరోగ్యానికి
పండిత డి. గోపాలాచార్యులవారి
జీవామృతం
1898 నుండి ప్రసిద్ధి గాంచినది
ఆయుర్వేదాశ్రమం
(ప్రైవేట్) లిమిటెడ్
మదరాసు-17

దీర్ఘవ్యాధులకు ఉత్తమ సిద్ధవైద్యం!

హస్తప్రయోగం, అంగము చిన్నదై, అవసర కాలమందు అసంతృప్తి, శుక్లనష్టము, నపుంసకత్వము, హెర్నియా, చర్మవ్యాధులు, పోస్టు ద్వారా కూడా వైద్యం చేయబడును. వరిబీజము (బుడ్డ), మూత్రవ్యాధులు ఆపరేషన్ లేకుండా. రండి.
డా॥ దేవర, ఫోన్ 551, మార్వాడీ గుడి వద్ద, తెనాలి.
బ్రాంచి: 26, నార్త్ బోగ్ రోడ్, మద్రాసు-17.

74 సం.గా అఖండ ఖ్యాతిగాంచిన
నారసింహ లేహ్యం
రిజిష్టర్డు ట్రేడ్ మార్కు
అన్ని రకములైన (ముఖ్యముగా పురుషుల) బలహీనతలను పోగొట్టి రక్త వృద్ధిని, పుష్టిని కలిగించు వాజీకరము.
1 డబ్బా రు. 7—25 పోస్టేజి ప్రత్యేకము.
వి. శి. ఏ. అండ్ కో.,
పెందేవి 523273 [ప్రకాశం జిల్లా]
క్యాటలాగు ఉచితము. కోరినవారికి ఏజన్సీలు ఇవ్వబడును.

హార్స్లీ హిల్సు పాఠశాల
హార్స్లీ హిల్సు [పోస్టు] చిత్తూరుజిల్లా (ఎ.పి)
ఈ పాఠశాల, కౌన్సిల్ ఫర్ ఇండియన్ స్కూల్ సర్టిఫికేట్ ఎగ్జామినేషన్స్ న్యూఢిల్లీకి అనుబంధము చేయబడినది. పబ్లిక్ స్కూలు పద్ధతులలో బాల, బాలికలకు ఇంగ్లీషు మీడియం రెసిడెన్షియల్ స్కూలుగా ఈ పాఠశాల నడుపబడుచున్నది.
1979 విద్యాసంవత్సరమునకు I నుండి VI తరగతులకు కొలది సీట్లు ఖాళీలున్నవి. వివరములకు దయచేసి వ్రాయండి. ప్రిన్సిపాల్.

**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**



"రావణుడే రాముడైతే"లో అక్కినేని నాగేశ్వరరావు

# ఐటెక్స్

## కాటుక & తిలకము




ఐటెక్స్ కాటుక మిశ్రములేని మంచి నూనెతో చేయబడినది. ఐటెక్స్ కాటుకలో యితర మందులు (కెమికల్స్) లేకమైనము ఉండదు. కనుక ఐటెక్స్ కాటుక కండ్లకు - ఉపయోగించతగినది మరియు ఐటెక్స్ కాటుక పసిపాపలకు కూడా ఉపయోగింపతగినది.

ఐటెక్స్ తిలకము మంచి వస్తువులతో, రంగులతో చేయబడినది - ఐటెక్స్ తిలకము మన మృధువైన చర్మమునకు ఉపయోగించుటకు సరియైనది - ఐటెక్స్ తిలకము మెరుస్తున్న రంగులలో మనోహరమైన వాసన ద్రవ్యములతో ఉండుటచేత మన అందమును వికశింపజేయును.




KAJAL

**ARAVIND LABORATORIES**
MADRAS-600 033

AL-TEL 44